# తొలి పలుకు

నేను ౧౦ సంవత్సరముల క్రిందట నిజాము రాష్ట్రము లో కొన్ని పల్లెలలో నివసించు ౫౦ వఱకు అముద్రిత గ్రంథముల సేకరించి గత సంవత్సరము వానిని హైదరాబాదు రెడ్డివిద్యార్థి వసతిగృహమునకిచ్చి యచ్చటి గ్రంథాలయములో లిఖితగ్రంథముల శాఖ (Manuscript branch) నొకదాని నేర్పాటుచేసితిని.

నాచే సంపాదింపఁబడిన గ్రంథములలో నీగరుడాచాఖ్యానముండెను. దీనిని ముద్రించుటకై నామిత్రులగు శ్రీ శేషాద్రిరమణకవులు నన్ను ప్రోత్సాహపఱచుటచే దాని నిప్పుడు ముద్రింపఁగలిగితిని. శ్రీ శేషాద్రిరమణకవులు ప్రోత్సహించిన నేరమునకై వారినే దీనికిఁబీఠిక వ్రాయుటకై కోరితిని. వారు సంతోషముతో వ్రాసియిచ్చిరి. కాని మాకార్యాలయము వారి ప్రమాదమువలన నది పోగొట్టుకొనిపోయెను. మరల శ్రీకవులను రెండవ పీఠిక వ్రాయుటకై నిర్బంధించితిని. ఇందుండునదట్టి పీఠికయే! ఈ శ్రమలకన్నింటికిని వారియెడనే నత్యంత కృతజ్ఞతా బద్ధుడను. ఆంధ్రులు మమ్మిట్టి గ్రంథములు ముందును ముద్రించి వారికి సమర్పించుకొనుటలో సహాయము పడుదురని నమ్ముచున్నాను.

ఇట్లు
విధేయుడు
సురవరము ప్రతాపరెడ్డి.

హైద్రాబాదు
౧౧-౧౦-౩౦

# పీఠిక

ఉత్తమకావ్యములలో నొకటిగ నెన్నఁదగిన యీద్విపదకావ్యము నేఁటిదనుక ముద్రితము కాకుంట విచారణీయము. శ్రీకృష్ణదేవరాయల కాలమున బయలువెడలిన కావ్యములలో నేటికింక నెన్నియో యనుపలభ్యములుగ నముద్రితములుగ నున్నవి. అట్టివానిలో నీకృతిరత్నముగూడ నొకటి. గ్రంథకర్త గ్రంథాంతమునఁ దన చరిత్రమును సంగ్రహముగ నీక్రింది విధముగాఁజెప్పికొనియున్నాఁడు.

ద్వి॥ జానకీ విభుపాదజలజ భృంగాయ
మానమానసుఁడు తిమ్మయ మంత్రిసుతుఁడు
ధీ సమన్వితుఁడు నాదిండ్లశాసనుడు
భాసురకీర్తి గోప ప్రధానుండు
చారుకృష్ణార్జున సంవాదమొనర
గారచియించె సత్కవులు నుతింప॥

ఉదాహృత భాగములవలనఁగాక యితరాధారములవలన నాదెండ్ల గోపమంత్రి నియోగ బ్రాహ్మణుఁడనియు, కౌశికగోత్రుఁ డనియుఁ దండ్రి తిమ్మయమంత్రి తల్లి కృష్ణాంబికయనియుఁ దెలియును. ఈయన కొండవీటి సీమలోని నాదెండ్ల నివాసియనుటకు ఆగ్రామమునఁగల కొండపయిని గొన్ని లిఖితాధారముల బాల్యావస్థలోఁ జూచినట్లు జ్ఞాపకముగలదు. ఇపుడా యాధారాదికము విస్మృతమైనది. ఈగోపమంత్రి శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముని ముఖ్యమంత్రి శేఖరుఁడగు తిమ్మరుసునకు మేనల్లుఁడు. అంతియగాదు. తొలుత గుత్తి

దుర్గమునకుఁ బరిపాలకుఁడుగను పిదప కొండవీటి సామ్రాజ్యమునకు రాజప్రతినిధిగను శ్రీరాయలవారిచే నియోగింపఁబడి కత్తికి గంటమునకు సమముగఁ బనిచెప్పిన జగజెట్టి.

నాదెండ్లగోపమంత్రి శాసనములు కొండవీటఁగలవు. ఈయన గుణప్రశంస కావ్యాదికములలోఁ గలదు. ఇంతియగాక యీయన రచించిన సంస్కృతగ్రంథ వ్యాఖ్యానములు జిజ్ఞాసువులకు వాఙ్మయ భిక్ష ప్రసాదించుచున్నవి. కవియై త్యాగియై భోగియై యీమహామహుఁ డాంధ్రదేశమున కొనర్చిన సేవ యపారమైనది. ఈయన కొండవీటి సామ్రాజ్యమును నిరంకుశముగాఁ బరిపాలించుచున్నందులకీక్రిందిదియాధారము చాలును.

"శ్రీకృష్ణక్షితిపాలమౌళిసచివః శ్రీసాళ్వతిమ్మప్రభుః
జామాతృప్రవరే ధురంధరవరే శ్రీగోపమంత్రీశ్వరే
ప్రాదత్తాఖిలకొండవీటి నగరీ సామ్రాజ్యధౌరేయతాం
మత్తేభాశ్వపదాతిసైన్యకలితాంపల్యంకికాంచామరీం"

"శ్రీకృష్ణరాయ నరనాథశిరః ప్రధానః
శ్రీసాళ్వతిమ్మసచివేశ్వర భాగినేయః
నాదెండ్లగోప సచివోనయతత్త్వవేదీ
శ్రీకొండవీటినగరైక ధురంధరోభూత్"

కొండవీటి శాసనము.

(ప్రకృతశాసనమున నింకను గోపమంత్రి ప్రశస్తి యభివర్ణింపఁబడినది. సప్తసంతానముల సైతము బడసినట్టులం

దుఁగలదు. ఈయన యంకితి మొందిన కృతులు దురదృష్టవ శమున నేఁటివఱకు వెలువడకున్నవి. గోపమంత్రి పండితవం శ జాతుఁడు. మేనమామగారగు తిమ్మరుసుమంత్రి బాలభా రతాది గ్రంథములకు వ్యాఖ్యవ్రాసిన ప్రచండ పండితుఁడు. అన్నయగు అప్పయామంత్రి మాదయగారి మల్లనచే రాజశే ఖరవిలాసము అంకితము నొందిన జీవన్ముక్తుఁడైన ధన్యుఁడు. ఈయన యమాత్యుఁడగు ఊరదేచమంత్రి తెనాలి రామలిం గకవిచే ఉద్భటారాధ్య చరిత్రమునంకితముగాగొని దేవీ పంచ స్తవికి వ్యాఖ్యయొనర్చియుఁ జేకొందినవాఁడు. ఆస్థానవిద్వాం సుఁడగు లొల్లాలక్ష్మీధరయజ్వ సమస్త శాస్త్రపారంగతుఁడు. సంస్కృతమునఁ బ్రచండకవి. సపరివారముగా వాఙ్మయసేవ కై జీవితము వెచ్చించినవాదెండ్లగోపమంత్రి జీవితము ప్రశస్త తరము. గోపమంత్రికవుల నాదరించువాఁడనియు సత్పాలకుఁ డనియు శాస్త్రపారంగతుఁడనియు సుందరాకారుఁడనియు మ హాత్యాగియనియు వీరాధి వీరుఁడనియు గ్రంథాంతరములం దుఁగలదు. ఇట్టిరసికరత్నము కావ్యరచనమునకుఁ గడఁగి తన యసామాన్య కౌశలాతిశయమును గవితాకల్పనమునఁ గూడలోకమునకుఁ దెలుపఁబూనుట గొప్ప విశేషము. ఏ న్వో ల్పోద్యోగము తలపెట్టఁబడినంతన ఆంధ్రవ్యక్తిత్వము మఱపు దెచ్చునేటి కాలమునకంటె వాఙ్మయసేవయే యాంధ్రవ్యక్తిత్వ సూచకమని బోధించిన గతకాలమెంతేని ప్రశస్తతరము.

నాదెండ్ల గోపమంత్రి కవితారచనమున మిగులఁ బ్రౌఢుఁడనుటకు ఈకృష్ణార్జున సంవాద మొక్కటి చాలును.

ఆకృతిని జిన్నదైనను గుణాతిశయమున నీకబ్బము సమకాలిక కావ్యలోకమునమిన్న. గయోపాఖ్యానకథ కేవల సంవాద రూపము ఒకరితో నొకరు సంభాషించుటయే యిందలి ప్రథానాంశము. తుదిఁగల సంగరము దనుక కథయంతయు నిట్లె నడచును. ఛందోనియమ బహుళములగు నితర వృత్తములకంటె నిట్టి కథలకు గేయరూపము, సాధారణ నియమాన్వితమునగు ద్విపద యెంతయుఁ దగియుండును. ఆ నన్నే వాఙ్మయ విదుండు రసజ్ఞుండునగు గోపమంత్రి తన కావ్యము ద్విపద నియతితోఁ బూర్తిగావించినాడు. ద్విపద రచనము ప్రగల్భతా సూచకము గాదనువాద మొకండు కలదు. అది యంతగా బాటింపఁదగనది కాదు. పూర్వాలంకారి కులు అది గద్యమే కానిండు పద్యమేకానిండు, రసవద్వాక్య భూయిష్ఠమైనదె కావ్యమనిరి. రసోత్సేకమున ద్విపద కావ్యమితర కావ్యలోకమున కించుకేనియుఁ దీసిపోవదనుటకు సోమనాథుని బసవపురాణము గౌరన హరిశ్చంద్ర చరిత్రము తార్కాణగా నీయవచ్చును.

"సాధుశబ్దార్థ సందర్భం
గుణాలంకార భూషితం
స్ఫుటరీతి రసోపేతం
కావ్యంకుర్వీత కీర్తయే—" వాభటుఁడు.
"రసాత్మకం వాక్యంకావ్యం"
"రమణీయార్థ ప్రతిపాదక శబ్దఃకావ్యం"

పండిత రాయలు.

ఏతాదృగుడా హృతభాగముల సమన్వయించి మృదు మధుర పదావృతము మనోహర భావోపేతము నగునదియే ఛందో విశేషముతో నున్నను కావ్యమేయను వారీ కృష్ణార్జున సంవాదము నాదరింపకపోరు. ఈచిఱుకబ్బమునఁ గథకుఁ ప్రధానస్థాన మొసఁగఁబడినది. కథపెంపు దగ్గించు దీర్ఘవర్ణనము లిందులేవు. వర్ణన సందర్భమునఁగవి కథాంశము విస్మరించిన ఘట్టములిందు గోచరింపవు. యుక్తాయుక్తము సందర్భశుద్ధి సముచితమునగు కథాంశముతో నీకావ్యము చదువఁ జవులూరునటుల గోపకవి మనోహరముగ వ్రాసినాఁడు. రాత్రి వర్ణనము సూర్యోదయ వర్ణనము సంగర వర్ణనము, పురవర్ణనము ఇందు రసవత్తరములు. గయుని నిష్ఠీవన విసర్జనము, ప్రమాద భూయిష్ఠము. కృష్ణుని శపథము కోపజన్యము. గయుని యాత్మరక్షణాన్వేషణ మాపద్ధర్మము. సుభద్ర రాయభారము ఉభయపక్ష సమ్మేళనా కాంక్షితము. సంగరము కర్తవ్యము. సంగర వారణము త్రిమూర్తుల ధర్మము. ఈయంశము లీగ్రంథమున స్పష్టముగ బోధయగు చున్నవి. సుభద్ర కృష్ణునితో నర్జునుతో భాషించు విధమీగ్రంథమున సముచితముగ సమయోచితముగ నున్నది. ఇట్లేయర్జునుని ప్రత్యుత్తరము గూడ నున్నది. కథా వస్తువును బెంచి సమయోచిత వర్ణనములతో నలంకరించుటయే యుక్తమకవి లక్షణము. ఈ నియతి పాటించిన కవులకు అనుకరణముతో నించుకేనియుఁ బనియుండదు. పై పెచ్చుగ ఉపజ్ఞ వెల్లి విరియుచుండును. కేవల కథాంశమునె నాదెండ్ల

గోపకవి లక్ష్యమున నుంచి గ్రంథరచనమునకుఁగడఁగిన కతన పూర్వోక్త సుగుణము లన్నియు నీకృష్ణార్జున సంవాదమున నిమిడినవి. ఆంధ్ర వాఙ్మయమున నిట్టికథా ప్రధాన గ్రంథములు పురాణయుగమునఁ దఱుచుగను ప్రబంధ యుగమునఁ గ్వాచిత్కముగను గలవు.

ఈ గ్రంథమున సందందు జాతీయములు లోకోక్తులు కవి సందర్భోచితముగఁ బొందపఱచినాఁడు.

"కోదఁగాని పులిమీఁదఁ గోలచాచెడిని"
"నలినిక్షీరోదక న్యాయమైయుండ"
"ఎందును బెరటిచెట్టెవ్వరికైన మందుగాదు"
"గోర్చుట్టుమీఁద రోకటిపోటు"
"తంగేటిజున్ను రాధాభర్తమనకు"

ఇట్టివె ఇంకఁ గొన్నియుఁ గలవు. సంభాషణములలో సరసము నిరాఘాటమునగు మృదుశైలియు వర్ణనములలో నీషత్కఠినశైలియు ననువగు తావుల రసోచితముగ నిక్క వినలకొల్పినాఁడు.

తేటతెనుంగు టల్లలికల కుదాహరణము.

"వినవయ్యరుక్మిణీ విభుఁడునీకడకు
పనిచినవచ్చితిఁ బాండుకుమార
జలజాక్షుతోడనీ జగడమేమిటికి
బలవద్విరోధంబు భావ్యంబుగాదు
నలినిక్షీరోదక న్యాయమైయుండ
వలనదేకైటభ వైరియునీవు".

సంస్కృత రచనమున కుదాహరణము

"పైతాంచలోద్భవ పవమానచలిత
పాటలవకుళాది పాదపప్రసవ
సందోహనిర్గళ చారుమరంద
బిందుపరంపర పృథ్విపై బొరుగ"
"కమనీయకింకిణీ ఘంటికాలోల
విమలరత్నప్రభా విలసితచక్రి
శుకపక్షవర్ణ భాసురజవనాశ్వ
సకలాస్త్రసంయుత స్యందనం బెక్కి."

గ్రంథమంతయు రసవత్తరమగు గ్రాంథిక భాషలో నున్నను గొన్ని తావుల యతిభ్రంశములు అపశబ్దములు కనుపించు చున్నవి. పంచమోములు, భృకుటి, పదములు రెండును దుష్టములు. ప్రత్యంతర సహాయమునఁ గాని వాని సుస్వరూప నిర్ణయమునకు వీలుండదు. "గెంటకయార్తుఁ జేప ట్టెడు" అను తావున యతి తొలంగినది. లేఖక ప్రమాదమునఁ బాఠము మార్పుజెందెనేమో? మిగిలిన లేఖకప్రమాదములు ముద్రణస్ఖాలిత్యములు యథారూపముగఁ బాఠక లోకము సంస్కరించు కొనఁగలదు.

ఈ గ్రంథకర్త కృష్ణదేవరాయలకుఁ బ్రతినిధిగావునను తిమ్మరుసుమంత్రికి మేనల్లుఁడుగావునను గాలనిర్ణయము సులభముగఁ జేయవచ్చును. నాదెండ్లగోపమంత్రి కొండవీడు పాలించినది (శా.శ ౧౪౩౭—౧౪౫౫) క్రీ. శ 1515-1533 వ అకని కొండవీటి దండకవిలెలోఁ గలదు. తిమ్మరుసుమంత్రి

క్రీ. శ ౧౫౧౫ జూను ౨౩ తేదికి సరియగు శా॥ శ ౧౪౩౭ ఆషాఢశుద్ధ ద్వాదశినాఁడు కొండవీడు జయించెను. వెంటనే రాజప్రతినిధిగ నేర్పడియుండెఁ గాన నీదండకవిలెలోని కాలము విశ్వసనీయము కానోవు. ఈమధ్యకాలమున కృష్ణార్జున సంవాదము పూర్తి చేయఁబడినటుల విశ్వసింపవచ్చును. ప్రబోధచంద్రోదయ వ్యాఖ్యయు నీకాలముననె యిక్కవి రచించి నట్లు తోచుచున్నది.

హైదరాబాదు రెడ్డివిద్యార్థి వసతిగృహమున గొప్ప గ్రంథ నిలయముగలదు. దాని క్షేమాభివృద్ధుల నరయు శ్రీసురవరము ప్రతాపరెడ్డిగారు సేకరించిన లిఖితగ్రంథసముదాయములో నొకటిగ నీకృష్ణార్జున సంవాదమున్నది. గ్రంథ ప్రశస్తి మేముగ్రహించి ప్రకటించుట యత్యావసరమన్నంతన శుద్ధప్రతివ్రాసి సంస్కరించి ముద్రించి ఈప్రతి యాంధ్రలోకమునకు సమర్పించుటలో శ్రీ ప్రతాపరెడ్డిగారెక్కుడు శ్రమ పడిరి. మదరాసు ఓరియంటలు లైబ్రరిలోఁ దక్కనెచటను నీగ్రంథమునకుఁ బ్రత్యంతర మున్నటుల గోచరింపలేదు. మదరాసులోని ప్రతియు అసమగ్రమని వాఙ్మయ సూచికవలనఁ దెలియుచున్నది. జీర్ణగ్రంథము చేయిజారిపోకముందె ఆంధ్రలోకమున కర్పించిన ప్రకాశకులు కృతజ్ఞతా పాత్రులు.

ఇట్లు భాషాసేవకులు

నందిగామ 1-1-1929 }

శేషాద్రిరమణకవులు
శతావధానులు.

శ్రీరస్తు.

# కృష్ణార్జున సంవాదము

---

శ్రీరామచంద్రు నూర్జిత కృపాసాంద్రు
నీరద సమవర్ణు నిఖిల సంపూర్ణు
నలఘు జయోత్సాహు నాజానుబాహు
దళితశంకరచాపు దమనప్రతాపు
శరధిగంభీరు కౌసల్యాకుమారు
హర జయస్తుతి పాత్రు సమరాంగజైత్రు
కరుణా సముద్రు భక్త జనౌఘ భద్రు
వరమౌని గణమిత్రు వనజాతనేత్రు
భావించి సేవించి బహు పూజనములు
గావించి మిగుల విజ్ఞానంబు బెంచి
యేకాంకధరుని గణేశుని గొలిచి
వాణీమహాదేవి వర్ణనచేసి
మేదిని గవితా సమిద్ధులై మెఱయు
ఆదిమ కవులను సందఱిఁ బొగడి
చారు కృష్ణార్జున సంవాద మొనర
గా రచియింతుఁ దత్క్రమ మెట్టిదనిన:—

# కథాప్రారంభము



మును నైమిశారణ్యమున శౌనకాది
మునులు సూతునిఁజూచి మురవైరి దొల్లి
గయునికై విజయుతోఁ గలహించి పిదప
గయుని నే విధమునఁ గాచి రక్షించె
నంతయు వినిపింపుమనిన సూతుండు
సంతోషమున మౌని సమితి కిట్లనియె.

—: ద్వారకా పురి వర్ణన :—

శ్రీకర వస్తు విశేష సామగ్రిఁ
బాక శాసనపురిఁ బ్రహసించి చాల
కనక సౌధములు విఖ్యాత సాలములు
ఘన తోరణములు చక్కని వారణములు
ఘన కేతనములు విప్ర నికేతనములు
విహిత వర్తకులు ప్రవీణ నర్తకులు
పద్మ చిత్రములు రాజన్య గోత్రములు
పద్మ నాయకులు చూపట్టు గాయకులు
తగిన వాహములు సంతత వివాహములు
నెగడు జోదులును మాణిక్య వేదులును
చెలఁగు గానములు యోషిద్వితానములు
గలిగి యొప్పెడు ద్వారకా పురిలోన.

## —:కృష్ణుడు రైవతమున కరుగుట:—

ఆ చక్రవాళ శైలావృత వసుమ
తీ చక్రవినుత పార్థివ నికురుంబ
మౌళి సముజ్జ్వల మహిత మాణిక్య
బాల భాను ప్రభా పటల విస్ఫార
పాదారవిందుఁడై పరగి కృష్ణుండు
యాదవ వృష్ణి భోజాన్వయుల్ గొ ల్వ
గమనీయ హ స్త కంకణ ఝణలు మెఱయు
రమణులు పింజామరంబులు వీవఁ
గలిత నానారత్న కాంతులు మెఱయు
గొలువు కూటంబునఁ గూర్చున్న వేళ
వనపాలుఁడొక్కఁడు వచ్చి కీరములు
మునుము కుక్క లెన్నఁడు మోపని పండ్లు
తుమ్మెద పొదపలు దోకొననట్టి
కమ్మ పువ్వులు పెక్కు కానుకలిచ్చి
దండ ప్రణామంబు తగనాచరించి
నిండు మనంబుతో నిలచి యిట్లనియె.
జగతీశ! యిపుడు వసంతాగమమునఁ
జిగురించె నుద్యానసీమ భూజములు
పూచె లాటములును బూచె సంపెఁగలు
పూచెఁ బున్నాగముల్ పూచెఁ బూగములు
పూచె నశోకముల్ పూచెఁ జూతములు
పూచెఁ గింశుకములు పూచె బూరుగులు

మొగ్గల పుష్పాల మునిఁబిండె దోర
లగ్గలమై ఫలమందుఁ గ్రిక్కిరిసి
కన్నుల పండువై కరము శోభిల్లు
చున్నదిపుడు చూడ నుద్యానము"నినఁ
మనసిజ గురుఁడంత మదినుత్సహించి
ఘనమైన పచ్చల కడియంబు లిచ్చి
వనపాలు మున్నుగా వనమున కనిచె
వనము గనుంగొన వలచి యా ప్రౌఢ
వారిజాక్షుండు కొల్వు వారల ననిచి
భోరునఁ దానంతి పురమున కరిగి
వలనుగా భూషణాంబర లేపనములఁ
చెలువగ్గలింపఁ గై సేసి యేతెంచి
కలయ పూసినయట్టి కమ్మ కస్తూరి
వలపులంతంత దువాళంబు సేయ
రహి కంఠమున నిండ రత్నహారములు
మహిత రోచుల వనమాలిక బాదవ
నలువగ్గలింప కర్ణమ్ముల నిడిన
తెలివైన యాణిముత్తెముల చౌకట్లు
నిండారు నొనపరి నిగ్గులగ్గములు
గండమండలమునఁ గడుఁ బిసాళింపఁ
దలఁ జుట్టినట్టి చిత్తరపు బంగారు
జిలుము నించిన పాగ చాయలుమీర
వర రథారూఢుఁడై వాసుదేవుండు
తురగసింధుర భటస్తోమంబు గొలువ

హితులు మంత్రులు పురోహితులు సేనాధి
పతులు సామంతులు పౌరులు గొలువ
నరరాజు భాగ్య దేవతలను బోలి
పొలుచు చక్కని పువ్వుబోణులు గొలువ
జంత్రవీణా వేణు శంఖమృదంగ
భేరీ రవంబులు చెల్లు మ్రోయఁగను
రమణ సామంతులు గుఱ్ఱంబులు మున్ను
రమణతో నేకు ధారుణ నడపింప
దేవతాధిప ముఖ్య దిక్పాల వినుత
రైవతకాచల ప్రాంతంబుడాసి
భూలోక విదితమై పొదలు హింతాల
తాల ఖర్జూర మందార తమాల
మాలూర వట పిచుమంద రసాల
సాల కదంబ కాశ్వత్థ పున్నాగ
నాగకేసర కురంటక జంబుపూగ
భోగ సంకీర్ణమై పొలుచు నవ్వనము
వేడుకతోఁ జొచ్చి వేఁడులు హితులు
కూడుక విహరించి కొంత ప్రొద్దునకుఁ

—: రాత్రి వర్ణన :—

గర మొప్ప నల శీత కరు రాకఁ గోరి
తరణి యర్క భేరి మోదమున చాటించి
పనివడి యపర దిగ్భామ వ్రాయించె

వసఁ బశ్చిమాంబుధి నర్కుండు గ్రుంకె
ఆ రాజు రాకకు యామినీ రమణి
కోరి యంబరమను కొలువు కూటమున
గట్టిగాఁ గెంబట్టు గట్టిన మేలు
కట్టన నెఱసంజ గనుపట్టెనట్టి
వనజాసనుని దిశావళి నిండినట్టి
వనజాక్షు గుణగణముల్ వాసించుటకును
గలియంగ జల్లిన కస్తూరి యనఁగ
నలమె భూతలమెల్ల నంధకారంబు
హరికీర్తి దుగ్ధాబ్ధి దనరు తుంపురల
వరుసను దార లంబరమున నిండె
బంధురాంబర సతీ పాణి పంకేజ
గంధోత్తమాః పూర్ణ కమనీయ పద్మ
రాగ హారంబన రమణమై నుదయు
రాగంబుతో నుడు రాజుదయించె.
అప్పుడు మధుకైట భామరారాతి
తప్పక కాలోచిత క్రియల్ దీర్చి
పమోద్మదమున నాప్త సఖులును దాను
నెమ్మది భుజియించి నిద్రించెనంత

—: కృష్ణుడు సూర్యుని కర్ఘ్యము లిచ్చుట :—

పనుపడి యుదుగక పద్మినీ లక్ష్మి
మును నోఁచినట్టి నోము ఫలంబనంగ

ఆదిత్య మండలం బల్లనఁ జొచ్చె
నాలోన మేల్కాంచి హంస రథాంగ
రోలంబకా నికురుంబ నాదముఁ
కైరవేందీవర కమల కల్హార
చారు పరాగ సంచయ సౌరభములు
వరలఁ నచ్చటి సరోవరమున కేఁగి
తరి శౌరి కాలోచిత క్రియల్ దీర్చి
పఁబీన జపాళి తాత్పర్యంబుతోడ
నంబుజాప్తునకు నర్ఘ్యము లిచ్చు చోట

— గయుని వృత్తాంతము —

చారు నానారత్న జాల విచిత్ర
హారకాంచన పుష్పకారూఢుడగుచు
గయుఁడను పేరిటి గంధర్వుఁడొకఁడు
రయమున నపుడు తామసనూతిఁ గొలువ
వినువీథిఁ జనిచని విధి వశంబునను
జెనసి యొనర్చె నిష్ఠీవనం బపుడు
అది వాయువశమున నరుదెంచి చాల
చెదరి మురారి దోసిటిలోనఁ బడిన
ఉదరి కోపించి మిన్ను గ్రక్కఁడై చూచి
వెదకి యెవ్వరు లేమిని విస్మయంబంది
యున్నంత యప్పుడా యుదక మధ్యమునఁ
దిన్నని గతి జలదేవత పలికె.

"ఓ దేవతారాధ్య! యో భక్తవరద
యీ దుష్టవర్తను నెఱిఁగింతు వినుము
శ్రీ నిషధాచల శిఖరంబునందు
మానితమైయొప్పు మణి నగరంబు
ప్రణుతికి నెక్కు నా పట్టణంబేలు
మణి మంతునకుఁ దా సుకుమారుఁడై పుట్టి
గయ నామధేయుండు కమలజుఁ గూర్చి
అయుతాబ్దములు ఘోరమైన తపంబు
గావించి వరములుగాంచి గర్వమున
దేవేంద్రముఖ్యులఁ దృణముగాఁ జూచు
పుష్పగంధములతోను బాలుపగ్గలించి
పుష్పకారూఢుఁడై పొదలిన వేడ్క
సకల లోకంబులయందుఁ జరించు
నిఖిలేశవాఁడు వో నేఁడిట్లు సేసె".

—కృష్ణుని ప్రతిజ్ఞ—

అని జలదేవత యత్తెఱంగెల్లఁ
దనకు జెప్పలయు రౌద్ర స్ఫూర్తి నిగిడి
పటపట బ్రహ్మాండ భాండములు పగులఁ
జటులత కోపించి చక్రాయుధుండు
బలభద్ర సాత్యకి ప్రముఖులఁ జూచి
పలికెను—వినుఁడు నా ప్రతిన చందంబు
ఉర్వి నూర్యార్ఘ్యంబు లొనరించువేళ

గర్వాంధుడగుచు విఘ్నంబు గావించె
కన్నులఁ గానఁడు కష్టపెట్టఁగాను
తన్ను దా నెఱుఁగక తామసుఁడగుచు
నట్టి దురాత్ముని నెన్ని చందములఁ
బట్టి చంపుదు చుట్టపట్టి పోనీక
త్రిదశులతోఁ గూడ దేవేంద్రుఁడేవిఁ
గదిసి యడ్డము వచ్చి కాచినన్నైన
అమిత సంయమి బృంద మందంద గొలువ
గమలాసనుఁడు వచ్చి కాచినన్నైనఁ
బ్రమథ వర్గముతోడ ఫాలలోచనుఁడు
గమకమైయెడఁ జొచ్చి కాచినన్నైన
నీరేడు జగముల నెందుఁ జొచ్చినను
దారుణతర చక్ర ధారచే ద్రుంతు
నెడపక యీ పూన్కి నీడేర్పకున్న
పుడమిచే వసుదేవ పుత్రుండఁగాను.
అని ప్రతిజ్ఞచేయుచు వచ్చి యమ్మహా సరసి
ఘన జలంబుల గ్రుంకి కమలలోచనుఁడు
రమణీయ ధౌతవస్త్రములు ధరించి
కమల మిత్రునకు నర్ఘ్యము లిచ్చుచుండె.
అంతట గయుఁడు మహా వేగమునను
నింతయు నెఱుఁగక యేఁగు నవ్వేళ
నాకాశవాణి యిట్లనియె నాతనికి

## —ఆకాశవాణి గయుని కెఱిఁగించుట—

కైకొని వినవయ్య గయుడ నా పలుకు
నిష్ఠీవనంబద్దు నీవు చేసినను
నిష్ఠురగతిఁబోయి నీరబాప్తునకు
హరి యర్ఘ్యమిచ్చుచో నంజలి పడినఁ
బరిమార్తు నిన్నని ప్రతినఁ గావించె
కావున నీవేగి కమల గర్భునకు
నీవిధ మెఱిఁగింపు మిప్పుడు పోయి
అను నభోవాణి వాక్యములకు బెదరి
ఘనవీథి గయుఁడును వివశుఁడై యేఁగె
నెన్నిక యోగీంద్రు [లెల్లరు] చాల
సన్నుతిగావించు సత్యలోకమున
కౌండిన్య కణ్వ మార్కండేయ కపిల
శాండిల్య వత్స మాంజాయన వ్యాస
పుండరీ కాగస్త్య పులహ మాతంగ
మాండవ్య శౌనక మైత్రేయ జహ్ను
గాలవ కౌశిక గౌతమ మండ
పాల పర్ణాశ జాబాల మాద్గల్య
వరతంతు కశ్యప వామదేవాత్రి
హరిత రోమజ ముఖ్యులైన సన్మునులు
నలువొందఁ దిథివార నక్షత్రయోగ
ముల కరణంబుల బుధుల నంబుధుల
సూనృ తానృతముల సుఖదుఃఖములను

బూని ప్రవర్తించు పుణ్య పాపములు
మొదలుగా నిన్నియు మూర్తినంతమున
నాడవు వేడుకఁ గొల్వ నొప్పారువానిఁ
బరితోషమునఁ గాంచి ప్రణమిల్లి భక్తిఁ
గరములు మొగిడించి కడఁకనుతించె

—గయుఁడు బ్రహ్మతో మొఱపెట్టుకొనుట—

సగుణ నిర్గుణ రూప సత్య స్వరూప
నిగమాంత సంవేద్య నిఖిల లోకాఢ్య
పరమ కృపాస్వాంత భారతీకాంత
వరముని స్తుతిపాత్ర వసునిభగాత్ర
అనుచు సన్నుతిచేసి యబ్జలోచనుని
ఘనమైన ప్రతిన వేగమె చెప్పటయును
గనక గర్భుఁడు విని కరుణా రసంబు
కనుగవల దొలఁగ గయుని కిట్లనియె.
"వసుధ భారము మాన్ప వలసి కృష్ణుండు
వసుదేవ తనయుఁడై వరలి జన్మించె
యశమొంది నరసింహుఁడై యా హిరణ్య
కశిపుని బట్టి నఖంబుల వ్రచ్చె
అడరి భార్గవ రాముఁడై జనియించె

మడియించె నయ్యేడు మాఱులు నృపుల
దశరథ రాముఁడై తానుద్భవించి
దశకంఠు శిరములు ధరణిపైఁ గూల్చె
పదుపడి పెక్కు రూపంబుల మఱియు
ధరబుట్టి దుష్టవర్తనుల దండించె
అతఁడు జగద్వంద్యుఁ డతఁడాదిమూర్తి
అసురు మాయలకెల్ల నాదికారణము
అతఁడు నేసిన యట్టి యతుల ప్రతిజ్ఞ
మెత్తెఱుంగున మాన్ప నెవ్వారి వశము
ఆ నీలకంఠుఁడే యట నీకు దిక్కు
గాని యన్యులచేతఁ గాదది యనుప
పొమ్ము శ్రీ కైలాస భూధరంబునకు
సమ్మహాదేవు దయాసిధిఁ గొలువు"
అని బుద్ధి చెప్పి చయ్యన వీడుకొలుప

—గయుఁడు కైలాసమున కేగుట.—

చనిచని యాతఁ డీశ్వరగిరి డాసి
కనుపట్టి తన పుష్పకము డిగ్గివచ్చి
అనువుగాఁ గనుదమ్మి యాకలిదీర
కనియె నపుడు మహా కైలాస నగము
ఈ వెండి కొండకు నెనయైన కొండ

భావింప జగములోపల నొండు గలదే
అనుచు డగ్గరి మ్రొక్కి యగ్గిరి యెక్కి
తన విచారము దక్కి తా భక్తి మొక్కి
వారసితుంబుర నారదులు సేయు మధుర
తరము లైనట్టి గీతంబుల వినుచు
చిత్తరంబునవచ్చి భృంగీశుడాడు
నుత్తర తాండవంబొనర జూచుచును
నొద్ద మిక్కిలి డాసియున్న గణేశు
ముద్దు చెక్కులు కరములు నివురుచును
భైరవ గుహ వీరభద్రుల సారె
సారెకు వీక్షించి సంతసింపుచు
ప్రమథ వరుల విన్నపము లియ్యకొనుచు
నమర సందోహంబు నాదరింపుచును
దళమైన పసిడి బెత్తము పూని నంది
పలుదెఱంగుల బరాబరులొనరింప
గరుడ కిన్నెర యక్ష గణరాజ సాధ్య
సుర సమూహములచే సొబగైనదాని
ఘనరంగ వల్లులు కనుపట్టుదాని
అనవద్య విద్యల నలరెడు దాని
భూరి సౌరభ్య కర్పూర పరాగ
పూరిత విధులచే బాడవైన దాని

విపణ మార్గంబుల విలసిల్లు దాని
విప్రుల పుణ్యాంబుల వెలుగొందు దాని
చూచిన యానంద సుఖకేలి దేలి
కడు రమ్యమైన శంకరు హజారంబు
కడచి యా ముందటం గాల కంధరుని
అవసరంబేమని యరసి చెప్పించి
అవల నత్యంత ప్రియంబున నచట
నందికేశ్వర భృంగినాయక ప్రముఖ
బృందారకాదిత్య బృందంబు గొలువ
కాలకంబుగ్రీవ కంకాళ హేమ
పాల చండీశ్వర భక్త హింకాళ
కాకోలధర మహాకాయ నికుంభ
గోకర్ణ ధూమ్రమాతృకులు మొదలయిన
గణ ముఖ్యులెల్ల సంగతితో భజింపఁ
బ్రణుత నానారత్న భద్రపీఠమున
హార మాణిక్య సింహాసనాగ్రమున
గౌరీ సమేతుండై కౌతూహలమున
పేరోలగంబు గంభీరత నున్న
నా రాజశేఖరు నల్లనఁ జేరి
భయభక్తి వినయ సంభ్రమ చిత్తుఁడగుచు
గయుఁడు సాగిలి మ్రొక్కి కరములు మొగిచి,
జయచంద్ర కోటీర! జయఫణిహార!
జయ నిర్జితానంగ! జయ కృపాపాంగ!

జయ మేరు కోదండ! జయ విష్ణు కాండ!
జయ గిరిజాధీశ! జయ పరమేశ!
జయజయ నిటలాక్ష! జయగణాధ్యక్ష!
పుట్టింపఁ బోషింపఁ బాడవణఁగింప
పట్టైన యా పరబ్రహ్మంబు నీవ!
యోగంబులును నీవ యుడుధులు నీవ
భోగ బులును నీవ పుణ్యము లీవ
నగములు నీవ పన్నగములు నీవ
నిగమంబులును నీవ నిఖిలము నీవ
ప్రణుతికి నెక్కుడై పరగ నిన్నర్థి
గణుతింప నేర్తునే కైలాస వాస
అని పెక్కు భంగుల నభినుతించుటయుఁ
గనుగొని శంభుఁడా గయుని కిట్లనియె.
"ఇరవొంద నెపుడు నీ రేడు లోకములఁ
జరియించు గంధర్వ సార్వభౌముఁడవు
ఎన్నఁడు లేదు నీకేమిటి వలన
నన్నంత కాంతి లేకున్నది చూడ
నీకసాధ్యము లేదు నిఖిల లోకముల
నీకిట్టి దైన్యంబు నేఁడేల కలిగె
వినిపింపు నాకు నీ వృత్తాంత మెల్ల"
అని యానతిచ్చిన నతడిట్లు పలికె
"నెఱుఁగక యపరాధ మే నొనరింప
నతిమతి కోపించి హరినన్ను జంపఁ

ప్రతిన పట్టుటయు నే భయమున గుంది
గతినీవయనుచు వేగంబ వచ్చితిని
కావుము నన్ను నో కరుణా సముద్ర"
నావుడు శంభుండు నగుచు నిట్లనియె
"అవ్యక్తుడన వద్యుడనఘుడ ఛేద్యు
డవ్యయుండైన నారాయణమూర్తి
ధారుణీ భారంబు దలగించు కొఱకు
నారూఢితో కృష్ణుడై పుట్టినాడు
చేకొని కృష్ణుండు చేసిన ప్రతిన
నాకు దీర్పంగ బూన న్యాయంబు గాదు
అతని పాలికి నేగుమా యదువంశ"
పతి నీళ్ల ముంచెడి పాల ముంచెనని
అని వీడుకొలిపిన నరుదెంచి గయుడు
తన మది భీతిల్లి తలపోయ దొడగె
నెల్ల లోకములకు నేలికై యుండి
చెల్లబో కటకటా శివుడును నేడు
చేపట్టి నన్ను రక్షింప లేడాయె
కాపురే దైవంబు పగవారి కూడె
నాదట జంపు జనార్దను నెదుట
బోదురె వాటి పాటి పోదురుగాక
యిలవులి దాసర్ల కిడియెద ననిన
వలనేది నమ్మి పోవచ్చునే చెపుమ
పంతంబు చెడి పట్టుబడిపోయి పిదప

చింతింప గతజల సేతుబంధనము
తనపూర్వ కర్మంబు ధాతకునైన
ననుభవింపకతీర దసిమున్న వినమె
మర్యాదదొలఁగియా మాయదైవంబు
నిర్యాణకాలంబు నేఁడిట్లుచేసె
పిడుగునుబోలునీ బెడిదంపువార్త
తడయక కర్ణరంధ్రములనుబడినఁ
గన్నవేల్పులనెల్లఁ గడఁగిప్రార్థించి
మున్నుగాఁ బెక్కు నోములనోచికాంచి
పెద్దకాలమునన్నుఁ బెనిచినమమత
దద్దయువగనొంది తల్లియేమగునొ
పెరిమితోనొకయేట పెంచెడువాని
మురువుగా నన్నొకపూఁటసే బెంచి
గుణవంతుడనిచాల కొనియాడుచుండు
మణిమంతుఁడేమని మరుగునో తండ్రి
"కంతుసన్నిభ నేఁడు కౌగిలిబాసి
యంతనే నిమిషమేనై యుండునాకు"
ననెడు ప్రాణేశ్వరి యకట యేభంగి
దినములుగడిపెడి తీవ్రవేదనల
నుడుగక చేసిన యుగ్రతపంబు
అడవిగాసిన వెన్నెలయ్యెబోనేడు
అనితలపోసి హుమ్మని వెచ్చనూర్చి
కనుఁగవ బాష్పముల్ గ్రమ్ముచున్నంత

-:నారదుడు గయుని కుపాయము చెప్పుట:-

నరవిందభవసూతి యవటికేతెంచి
"నారాయణుండును నరుఁడును ననఁగ
నారూఢిఁబరగి నారాదివ్యమునులు
బలిసిభూభారంబు బాపెడికొఱకు
నలరికృష్ణార్జునులై పుట్టినారు
ఆచక్రపాణికి నడ్డమైనవ్వ
సాచినీప్రాణంబు చయ్యనఁగాచు
బ్రొమ్మగంధర్వేశ భూలోకమునకు
నమ్మునావచనంబు" నావినిగయుడు
తనలోననొక్కింత తడవుచింతించి
వినయంబుప్రియమును వెరవునుగమర
ననిమిషలోకసంయమికి నిట్లనియె
"వినవయ్యమునినాథ విన్నవించెదను
మచ్చిక పార్థుఁడమ్మధువిరోధికిని
నెచ్చెలికాఁడని నీవెచెప్పితివి
అర్జునుపాలికే నరిగిననన్ను
దుర్జయుండనిపట్టి తోడ్తో జాతునకు
నొప్పగించిన మఱియోమునినాథ
తప్పదే కార్యమెంతయు విచారింప
నామహామహులైన హరపితామహులు

ఈమెయుఁగావలె కిప్పుడున్న వారు
మనుజ మాత్రుఁడు నన్ను మతిఁ గావఁగలఁడె"
అనుటయు నారదుం డతనికిట్లనియె
" అనుపమ బాహుబలాధికు నరుని
మనుజమాత్రుం డని మదిఁ దలంపకుము
మగటిమి యదు వీరమం కలిఁ దతిమి
తెగువమీఱ సుభద్రఁ దెచ్చె వేవేగ
ఖాండవంబును గాల్చి గాండీవమునను
కాండానలమున నాఖండలుఁ దతిమె
అతుల దిగ్విజయంబునందు దేశాధి
పతుల చే నెల్ల కప్పంబులు గొనియె
శైలజాపతి నని మెచ్చఁజేసి
పాశుపతాస్త్రంబు బాటించి తెచ్చె
భవ్యంబుగా దిశాపాలుర చేత
వ్యబాణంబులు తేకువఁ గాంచె
కాలకేయ నివాతకవచాది దైత్య
పాలుర నెల్లను బట్టి వధించె
రథసంబుతోఁ జిత్రరథుని గంధర్వ
విభుఁ బరాజితుని గావించెఁ బోరాడి
నెమ్మెఁ గిరీటికి నీనుఁగా మెంత
పొమ్ము తక్కిన వెఱ్ఱి బుదులు మాని

అతఁడు ద్వైతవనంబునందు నే ప్రొద్దు
మతిభయంబంది ధర్మతనూభవునకు
బవన నందనునకుఁ బాంచాలసుతకు
కవలకునావలి గాలియుమీాద
మీావుల నెన్నండేని మించివీచుటకు
శాకుండ నందు బరామరిసించి
తేకువ నాతండు దేవేంద్ర నిభుఁడు
ఆతనికడ కేగుమని మరగించి
ఆమహాధీయోగ విద్యావిశారదుఁడు
నారదుఁడేగిన నయముగా గయుడు

—[గయుఁడర్జునునిశరణుజొచ్చుట]—

భావంబు చెలఁగ పుష్పకమును నెక్కి
వావిరితా ద్వైత వనమున కేఁగి
యేచితుమ్మెదలకు నిరవుగామిగుల
బూచినసహకార భూజంబునీడ
దట్టించి యుగ్ర తపంబును బెరయ
బిట్టుగాండివము మోపెట్టినవాని
వాఁడిమీారిన పాడవాతియమ్మేర్చి
పోడిగావల కేలఁబూనిన వాని
ఘనతర శాస్త్ర మార్గణములపాదులు

వెనుకదిక్కునఁజాల విలసిల్లువాని
తొలుకరి మెఱుపు తోఁదులఁదూఁగువాని
గలిగిన జిగిమించు కాయంబువాని
జలజసంకాశ లోచన యుగళమునను
పలుమాఱుగెళవులు పరికించువాని
గంభీరమూర్తియై కనుపట్టువాని
బలువైనయాజాను బాహులవాని
పొలుపొందుభూతి త్రిపుండ్రంబువాని
జంభారిఁబోలిన చక్కనివాని
గంభీరమూర్తియై కనుపట్టువాని
వివ్వచ్చుజగదేక వీరుని గయుఁడు
దవ్వుదవ్వులఁగాంచి తద్దయు వేడ్కఁ
బెన్నిధానముగన్న పేదచందమున
నున్నఁబుప్పకమును నొగిడిగ్గివచ్చి
అకలంకభక్తి సాష్టాంగంబుచేసి
ముకుళితహస్తుఁడై ముందఱనిలువ
ఆకిరీటియు జూచియతినికిట్లనియె.
‘‘ఎక్కడనుండి నీవేఁగుదెంచితివి
నీనివాసంబెద్ది నీవంశమేది
నీనామధేయంబు నిజముగానేది
వచ్చినపనియేమి వరుసతోఁబూస
గ్రుచ్చినట్లింతయుఁగొంకక చెప్పుమ’’
అనవుడు గంధర్వుఁడనియె ‘‘ఓపార్థ!

వినుమెఱింగింతు నావృత్తాంతమెల్ల
మయనిర్మితాకార మణిపురాధిపుండ
గయునామధేయుండ గంధర్వ విభుడ
నరనాథకుంజర! నాప్రాణభీతి
శరణార్థినై యిటంజను దెంచినాండం
జయ్యానభయ హస్తంబిచ్చినన్ను
నెయ్యంబుతోంగాంచి నేడురక్షింపు
మున్న తెఱంగెల్ల నొయ్యానవెనుక
విన్నవించెదంగాని విశదంబుగాను"
నావుడు గయునితోనరుండొప్పంబలికె
"నీవేల వెఱచెదు నీభీతివిడువు
చతురంగవాహినీ సహితులై భూమి
పతులైన రానిమ్ము పట్టియొప్పింప
గరుడకిన్నర యక్షగంధర్వ ఖచర
వరులైన రానిమ్ము వదలియొప్పింప
హరిహరబ్రహ్మదులైన రానిమ్ము
బిగాదంబు దిగనాడి బెదరియొప్పింప
శరణనివచ్చిన శత్రువునైన
పరులకొప్పింపనీపంతంబునాది
వెక్కన పడినిన్ను విడిచితినేని
తక్కకధర్మజు తమ్ముండగాను
వొడలింతయు సముద్రముడుగొన్నభూమి

విడివఁడు నేయెంత వీరవరుండు
కొంకక నిను బట్టికొనిపోవఁగలండా
శకింపకుండుము చక్కనడాసి
నమ్మని గంధర్వ రాజు చేపట్టి
సమ్మతి నభయహస్తం బిచ్చిపలికె
నెవ్వరివలన నేఁడీ ప్రాణభీతి
నివ్వసుంధరనీకు నేటికిఁగలిగె
చెప్పుమాయనవుడు చిఱునవ్వునవ్వి
కప్పిపెట్టక చెప్పఁగడగె నాగయుండు
ఈగతి నెఱిఁగింతు నిపుడుపేరొక్క
లాగునకాకతాళ న్యాయమునను
హారికినేనపరాధి నైననురోష
భరమున ననుఁజంపఁ బతిన సేయుటయు
బిమ్మిడిగొనిప్రాణభీతినయ్యర్జుని
సమ్ముఖంబునకేగి శరణు వేఁడుటయు
జత్తురానమండును శౌరి ప్రతిజ్ఞ
మదిని విచారించి మాశసాధ్యంబు
ఓడకమృత్యుంజయునిపాలికేఁగి
వేడు కొమ్మనినన్ను వీనుకొల్పుటయు
కైలాసమునకేఁగి కాలకంధరుని
పాలనంతయు విన్నపము జేసికొనిన
ఫాలలోచనుఁడునా ప్రాణంబుగావ

జాలక యూఱక జరిపిపుచ్చినను
సరసీ రుహాసన చంద్ర శేఖరుల
సురస మూహాంబులచోట్లు చాలించి
చేరడిక్కెఱుంగక చింతించువేళ
నారదుం డేతెంచి నన్నువీక్షించె
అత్యుత్తముండు శరణార్త రక్షకుండు
సత్యసంధుండు సర్వసాచియే జగతి
అనుచు నీకండువ యతండు చెప్పటయు
ఘనమైన వేడ్కతోఁ గదలి వచ్చితిని
విన్న దొక్కటియును వివరింపఁ దెలియ
గన్న దొక్కటియును గాకుండ నన్ను
గాచి రక్షించితి గానలోకముల
నాచంద్ర తారార్క మయ్యెనీకీర్తి"
అనుటయు నప్పాండవాగ్రజుండకు
ఘనుండు కిరీటియుఁ గనుఁగొనిపోయి
అకలంక భక్తిసాష్టాంగంబుచేసి
మొగిసిన కేలుదమ్ముల తోడనిలువ
శతమఖాత్మజుఁజూచి శమనతనూజుఁ
డితఁడెవ్వఁ డేర్పడ నెఱిఁగింపు మనిన
గాండీవి ధర్మజుఁ గనుఁగొని పలికె
ఈచండితారాతి యీతఁడు గయాహ్వయుఁడు
గంధర్వ విభుఁడులోక ప్రసిద్ధుండు

బంధురైశ్వర్య సంపన్నుండు గయుఁడు
తనప్రాణ భయమునఁ దగిలినాకడకుఁ
జనుదెంచి యభయ హస్తంబు వేడుటయుఁ
గరుణదలిర్ప నేఁ గాచితిననిన
హరిచంపఁ దలచినాడని చెప్పెబిదప
ఆమాటవిని భయార్తుండ నేనగుచు
యేమాటనాడక యేనున్నవాఁడ॥
నావుడు నాధర్మ నందనుఁడనియెఁ
దావిచారించి సుత్రామ పుత్రునకుఁ
దానెదిక్కని వచ్చి దైన్యంబునొంది
వానిఁ బొమ్మననెట్లు వచ్చునోరాడి
చెలఁగి భయాతురుఁ జేపట్టి విడువ
దలఁచుట క్షత్రియ ధర్మంబుగాదు
గెంటకయార్తుఁ జేపట్టెడునంత
కంటెను పుణ్యంబుగలదె లోకములఁ
దల్లియు దండ్రియు దైవంబు గురుఁడు
నెల్లెడ కృష్ణుఁడే యిటఁజూడ మనకు
వెన్నునకెగ్గు గావించినవాని
నెన్నక చేపట్టు టిదియెద్రోహంబు
దైవకృతంబిది తప్పింపరాదు
నీవేమి సేయుదు నీకువశంబె

కావలసినపని గాకపోరాదు
ఏవిధంబుననైన నేమనవచ్చు
నావుడు ధర్మనందనుని వీక్షించి
యావాయు నందనుం డప్పుడిట్లనియె
త్రాడిబడం గార్యంబు తోడుతంజేసి
చిడిముడి పడియేమి సేయంగవచ్చు
వతండేమి నేనేమి యనకమురారి
యితనితోం బోరాడ నెంచెనయేని
యెప్పటికైన నట్లయ్యెడుంగాక
యిప్పుడు గయునగాచు టిదియధర్మంబు
అనుచు భీముండుపలుక నప్పుడేవురును
గనుంగొని కడంకతో గయుం గాచిరంత.

— { గయు నొప్పింపుమని కృష్ణుడు పాండవులకుం జెప్పిపంపుట. } —

వనజాక్షుం డంతనా వనజాకరమున
నినునకు నర్ఘ్యంబు లిచ్చిచాలించి
యంతరజ్ఞానంబు నందువీక్షించి
కౌంతేయులొద్దనా గయుండుండు టెఱింగి
చెనసిన గయుండునా చేతికివచ్చె
ననియంత రంగంబు నందు మోదించి
సకల కళావంతు సంతతస్వాంతు

సకలంక గుణవంతు నావేగవంతు
రావించి పలికెగౌరవమున నపుడు
వావిరిగా ద్వైతవనమున కేఁగి
ధర్మనందనుఁన కాతని తమ్ములకును
ధర్మదేవతఁబోలి తనరుద్రౌపదికి
ధౌమ్యాదులకును సంతతకుశలంబు
సౌమ్యభావమున విచారించిపిదప
నామప్రతిజ్ఞ చందంబు ప్రార్థనకు
నాదరమ్మున నెఱిఁగింపుమని
యనిపిడు కొలిపిన నాతఁడుధర్మ
తనయుఁబాలికి నేఁగి తగ్రమ్రొక్కి పలికె
ద్వారకనుండి మాధవుఁడు మీక్షేమ
మారసిరమ్మన్న నరుగు దెంచితిని
మీకందఱకుక్షేమమే నేఁటి తుదకు
నాకెఱిగింపు మోనరనాథ యనిన
సుచరిత్ర యాధర్మ సూతియాతనికి
నుచితోప చారంబు లొనర్చి పలిపి
హరిక్షేమ మందందయడిగి బాంధవుల
పరిణామమెల్ల నేర్పఁడునట్లు దెలిసి
యంతయుసంతుష్ట హృదయుఁడై వేగ
వంతునకును సత్యవంతు డిట్లనియె.

ఆపదలెల్లఁ జయ్యనఁ దొలఁగించి
యేపటునను శుభములిచ్చి రక్షించు
కరుణమా మీదను గలుగునన్నాళ్లు
పరిణామ మేకాక పరగునె [తలఁప]
అనివిన్నపము సేయుమంబు జాత్మునకు
ననినఁ బార్థునిజూచి యితఁడిట్లు పలికె

--:అర్జునుఁడు గయుని పట్టింప నిరాకరించుట:--

హెచ్చియూఱక శౌరికెగ్గొనరించి
వచ్చియిపుడుమంచి వాఁడునఁబోలి
గయుఁడనువాఁడు నిక్కడ నున్నవాఁడు
రయమున నతనిద్వారకకు [బుత్తేమ్ము]
అనుటయుఁ బరికించియా వేగవంతుఁ
గనుఁగొని నరుఁడంత గ్రమ్మఱబలికె
అరుదెంచి ప్రాణభయంబున గయుఁడు
శరణంబుఁ జొచ్చినఁ జక్కఁగాచితిని
శరణాగతుల వధూజనుల బాలకులఁ
దొరకొని హింసించు దోషకారులకు
నిలను బ్రాయశ్చిత్తమే పుట్టదనుచు
బలికెడు శ్రుతివాక్య పద్ధతివినవె
కావున దయమాలి గయుబట్టి గొఱియ
గానిచ్చుచే పాతకంబు పొమ్మనిన

వేగవంతుడుకడు వేగమే తెంచి
యాగతిచెప్పిన నాముకుందుండు
సురుగతి బొడమెను సుగ్రోషమున
సకలాయ మానసే త్రాంచలుఁ డగుచు
మానఁడెన్నఁడు తనమందె మేలములు
కానఁడు కన్నుల గర్వంబువొట్టి
మదమునని దె మామమలయు చున్నాఁడు
గొదగాని పులిమీఁదఁ గోలచాచెడిని
నెమరుఁ దన్నెఱుగఁడు నిదెవాకుఁదనకు
మదిఁదలంచిన హస్తిమశ కాంతరంబు
అరయఁ బర్వతపర మాణువులట్ల
బిరుదు సంధించెడు పెద్దఱికమని

—: శ్రీకృష్ణుఁడు అక్రూరుని నర్జునుదగ్గఱకు పంపుట :—

నక్రూరుడైనట్టి యక్రూరుఁ బిలిచి
సక్రోధచిత్తుఁడై శౌరియిట్లనియె
వగనను నెఱుఁగు దాతని నెఱుంగుదువు
తగవైన కార్యపద్ధతి యెఱుంగుదువు
పొమ్ము ఫల్గును వెట్టిబుద్ధులు మాన్పి
తెమ్ము గంధర్వునే తెఱఁగునైన
అనిన మాధవునాజ్ఞ నాఁడలంబూని
చనియుతఁడా సవ్యసాచి కిట్లనియె

“ విననయ్య రుక్మిణి విభుఁడునీ కడకుఁ
బనిచిన వచ్చితిఁ బాండుకుమార
జలజాక్షుతోడనీ జగడమేమిటికి
బలవద్విరోధంబు భావ్యంబుగాదు
నలినిత్క్షీరోద కన్యాయమై యుండ
నలవదే? కైటభవైరియు నీవు
కాచుకొన్నాఁడ వెక్కడ గోత్రకలహ
మాచరింపంగ నేమున వచ్చునిన్ను
నవారికెవ్వార లెక్కుడిగ యుడు
ఎవ్వారికేవ్వారిఁ కెక్కుడిగ యుడు
నీవేల పెనఁగెదు నీతిఁబోవిడిచి
చెలఁగి వెన్నుఁడునీకుఁ జేసినమేలు
తలఁపక మాటాడ ధర్మంబుగాదు
దైవంబు గురుఁడు బాంధవుఁడు మిత్రుండు
గోవిందుఁడతని మార్గానఁ దగునయ్య
నిగ్రహా నుగ్రహ నిపుణుండు శౌరి
ఆగ్రహింపక మున్నెయనుష్టము గయ్యని
అనినను వినియప్పుడా పాండురాజ
తనయుఁడు మెల్లనా తనికి నిట్లనియె
అవల ప్రాణభయాతురుఁడగుచు

నీవెదిక్కని వచ్చినిలిచినవాని
భూపాలవర్యులు పుడమిని ద్రోల్లి
చేపట్టి విడిచిరే చెప్పుమానీవు
వినిప్రాణభయమున వెనుక జొచ్చినను
గనికరంబున శిబిగావఁడేఖగము
ఆవిభీషణు శరణాగతుమున్న
కావఁడే చేపట్టికరుణ రాఘవుఁడు
పరికించి భూపతి పట్టినప్రతిన
అరయ శిలాక్షరమైయుండవలదె
అటుగాన భూపతు లవనిలోఁగీర్తి
అక్కటనీవును నట్లుకాదన్న
మొక్కడబట్టి నీకెఱుఁగఁజెప్పెదను
వడఁదల సైఁదల వచ్చిననైన
విడువను గంధర్వ విభుని బొమ్మనినఁ
గనకాంబరుని సమ్ముఖంబునమగుడ
అనువొంద శార్ఙ్గితోన క్రూరుఁడనియె
తివిరి మీయానతి తెలుఁగుఁజెప్పుటయు
భువనైకవీరుఁడా పురుహూతసుతుఁడు
జాగులు పచరించి సాకులుకొన్ని
యాగయునీసని యాతఁడాడెననిన
జలజాక్షుఁడధిక రోష స్వాంతుఁడగుచు

బిలిచిసుభద్రరప్పించియిట్లనియె
నీవేఁగిక్రీడికి నేర్చిన యట్లు
వేవేల బుద్ధులు వివరించిచెప్పి
తేకువ గయునిబుత్తెమ్మను మట్లు
కాకున్నమఘు బిందు కలహామానసుము

— { కృష్ణుడుసుభద్రతో అర్జునునికి సందేశమంపుట

అనివీడు కొలిపిన నాసుభద్రయును
మనమునభయము సంభ్రమములునిగుడ
నిరుపమ మాణిక్యనిర్మల ప్రభల
బరగెడు బంగారు పల్లకియెక్కి
కమ్మవిల్తునిముల్కికై వడినలరు
కొమ్మలు పెక్కండ్రు గొలిచి యేతేర
వాసవాత్మజుఁడున్న వనమున కేఁగి
భాసురంబైనట్టిపల్లకిడిగ్గి
పైకాంచలోద్భవ పవమా నచలిత
పాటలవకుళాది పానప్రసవ
సందోహ నిర్గత చారుమరంద
బిందుపరంపర పృథ్విపై దొరఁగ
మృదుపాదతలమున మిక్కుటంబగుచు

నొదవిన కెంజాయ లొక్కవిధాన
నెట్టనసూత్న మాణిక్యజాలముల
కట్టిన నెలకట్టు కడలకీపింప
ఉన్నత కుచకుంభ యుగళభారమున
జన్నువనెన్నడు మసియాడుచుండ
తెలివితాటంక మూక్తికముల రుచులు
కలికిచూపు గములరెట్టింప
వారక వెనువెంట వచ్చుకామాంధ
కారంబుగతి కొప్పుకమ నొప్పుమిగుల
రతివల్లభుని శిరోరత్న మోయనఁగ
అతులిత సమ్మోహ నాస్త్ర మోయనఁగ
జగతి శృంగార రసంబెల్లనజుఁడు
చిగురాకుఁబోఁడిగాఁ జేసెనోయనఁగ
చిత్తంబు రంజిల్లఁ జెలువంబుదాను
మొత్తమై నరుని సమ్ముఖమునకేఁగి
జగతిసాగిలి మ్రొక్కి శతమన్యుసుతుని
మొగము వీక్షించి సమ్మోదంబుతోడ
భద్రలక్షణములఁ బరఁగినయట్టి
భద్రేభయాన సుభద్రయిట్లనియె
గయుఁడను పేరిటి గంధర్వునొకని

ఇట్టి చలంబు నీ కేల గర్వంబు
కట్టిపెట్టుము వేగ గయుని బు త్తెమ్ము"
అనిన గాండీవి యిట్లనె నో సుబల!
"వినుము చెప్పెద నీకు విశదంబుగాఁగ
కలితమ హాత్మ్యంబు గలుగువాఁడనియు
లలిజన్మ పోషణ లయకర్త యనియు
మనల రక్షించు నేమంబు వాఁడనియు
నీనిసియా చక్రిని గెలువరాదనియు
నెఱిఁగిన వాఁడనౌ కిఁ భయాతురుని
నారక యొప్పించు టుచితంబుగాదు
పౌరుషంబెసగ నిర్భయ వృత్తి నెదిరి
నైరిచేఁ జచ్చిన వారికినిపుము
అశ్వమేధ ఫలంబు లడుగడుగునకు
విశ్వంభరాస్థలి వేగంబె కలుగు
హరిమాత్రయే కాదు హరిమధ్యనాకు
హరిణాక్షి మీద నస్త్రైనను లెస్స
విరసంబుగా నిమ్ము వేయు భంగులను
శరణార్తియగు వానిఁ జంపంగ నీను
చాలు చెప్పకుఁ జత్తు సరిపోదుగాని
వాలాయముగ నీను నై కుంఠునాన"
అని వీడు కొలిపిన నా సుభద్రయును

జనుదెంచియప్పుడు శార్ఙ్గికిట్లనియె
ఇప్పుడు నేఁబోయి యింద్రసూనునకుఁ
జెప్పుడుగతినెల్లఁ జెప్పితిబుద్ధి
ప్రతివచింపక ముష్కరపు ప్రతిజ్ఞమెయి
నితరంబునొల్లక యిప్పుడున్నాఁడు
ఆదికాలంబునాఁడతఁడెన్ని విధుల
సాదరంబుననిన్ను సాకియున్నాఁడో
తీవ్రమైన యతనికీర్తి ప్రతాపంబు
ఆరసిచూచిననీవె యాదికారణము
నెరయవాతని కీర్తి నీకీర్తియంతె?
అతని బాహుబలంబు నతనిచలంబు
అతనిసత్యంబు నీవటమెఁ యుంగుదువు
చక్రినా తనిరణస్థలి నిల్చెనేని
శక్రేంద్రు యోధులఁబిలుకుమార్చెడిని
కోపంబుచాలించి గురుకృపామహిమ
దీపింపనీమఱఁదికి మాటనిలుపు
పూనిక నీకింత బుద్ధులు చెప్పంగ
నేనెంతదాననో యిభరాజ వదన
అనిన సుద్ధతి దానవాంతకుఁడనియె
వినుము నే నీకుగా వెఱచెదఁగాని
పంతమంతయుఁ జటాపంచగావించి

యింతకు తల్లదంతుని చక్రిధార
ఇలబడ బాగ్నికిఁ హిమకణం బెంత
తెలియదావాగ్నికిఁ దృణగణం బెంత
యేమనువాఁడు నాయెదుట ప్రతిజ్ఞ
సేమూడిక్కి చెల్లునో యింతటివిూఁద
నేనెఱింగెద నాతఁడెఱుగడుఁగాని
పూనిచింతింపక పోమ్మని యనిన
అప్పుడు సాత్యకిహరికి నిట్లనిపెఁ
నప్పాండవులకంటె నక్కడమనకు
గలరె యచ్చోట డగ్గఱిన చుట్టములు
తెలియవారలలోన దేవేంద్రసుతుఁడు
నీవు మిక్కిలిగ మన్నించి సత్కృపను
కావింతు చెప్పుడు కడఁగిహితంబు
అటుగాక మనమేనయత్తకుఁ బుట్టె
యిటు సుభద్రికుఁ బతియేమనవచ్చు
నే తెఱుంగున నైన నిప్పుడు నీకు
నాతనివిూఁద శౌర్యము చూపదగవె
చండత రోద్దండ శార్ఙ్గకోదండ
పాండిత్య జితపురభంజనుఁ బార్థు
నీ వెఱుంగవె నీకు నేఁ జెప్పవశమె
కావునన తనితోఁగల హంబుమేలె?

జగతిజనంబులు సరిచంపరాని
పగఁదెంప రాదనుపలుకులు వినవె
అనినసాత్యకి మాటలంగీకరించి
వినిపల్కెనయ్యాదు వీర శేఖరుఁడు
కుంతీమహాదేవి కూరిమిపట్టి
యింతటివాడని యేనెఱుంగుదును
యెట్టుమానెడివాఁడనే జలపట్టి
పట్టిన యీపట్టుపట్టున నేఁడు
వాలాయము గద్వైతవనమున కేఁగి
ఆలంబులోఁగ్రీడి నాలంబుచేసి
కడిమికెట్టింప నాగంధర్వ విభుని
విడు పించుకొనికడు వేగరావలయు
పదినొండు తలఁపకమన సేనలెల్ల
కదన సన్నద్ధంబుగా వించుమనిన
చెదరక సాత్యకిసేన కొక్కింత
కదన సద్ధంబు గావించెనంత
అస్తోకతరవైభ వాస్పదంబైన
హాస్తినాపురములో హర్షాత్ముఁడగుచు
అలకృపద్రోణ భీష్మాదులతోడ
బలసిదుర్యోధన ప్రముఖులు గొలువ

కొలువున్నధృత రాష్ట్రుకొలువులోపలికి
వలతికుంచియ తపసుల కేలంబూని
యరుణజటా భారమందమై మెఱయ
శరదిందుసమత సుచ్ఛాయ శోభిల్ల
మహిత నారాయణ మంత్రరాజంబు
మహతి మ్రోయఁగ దివ్యమౌని వచ్చెనను
ఆసనార్ఘ్యాదులు నలరఁజేయుటయు
నాసంయమీంద్రుఁడిట్లనియె నాతనికి
ఏరాజునకుఁగలరీ కుమారకులు
దారుణాటోప ప్రతాప సంయుతులు
ఈద్రోణుఁడీ భీష్ముఁడీకృపాచార్యుఁ
డీద్రోణతనయుండునెచ్చో టఁగలఁడు
వినుకౌరవేంద్రుని విభవంబునేఁడు
కనుఁగొన నాకన్నుఁగవ చల్లనయ్యెఁ
బాండుపుత్రులపడు పాట్లకుఁదోడు
పుండరీ కాక్షుఁడిపుడు కలహించె
కొలఁదికిమీఱిన గోర్చుట్టుమీఁద
అలమిరోఁకటి పోటులైన యట్లయ్యె
ప్రకటించిమీరలా పాండుపుత్రులకు
నకటయిప్పుడు సహాయంబుగా వలయు

షానరనాపదలుకా వురముండవెపుడు
అనిచెప్పిదీవించి యామహావిచనిన
నాక్కింతచింతించి యుర్వీతలేశుఁ
డొక్కటభీష్మాది యోధులకనియె
దివిజ సంయమిమాట తెఱఁ గొప్పమీరు
వివరించివింటిరే విస్మయం బిపుడు
తలపోయ దేవకీ తనయునితోడఁ
గలహంబుకీడికిఁ గలుగుటయెట్లు
వినఁగూడ దీమాట వేయుఁ జెప్పినను
వనజాక్షుతోఁ బగవడయునె నరుఁడు
రారమ్మనక యనురాగమ్ముతోడ
వారికిఁ దోడుపోవచ్చునే చెపుడ
అనుటయుభీష్మాదు లాధృతరాష్ట్రి
మనుజాధిపునకు సమ్మదంబుగాననిరి
మూఁడనేపట్టున సురలోకమౌని
యాడెడువాఁడుగాఁడ నృతవాక్యముల
నిదినిజంబని నిశ్చ యింపఁగవచ్చుఁ
మదిగల్లయనిమాకుఁ దోఁచదేమియును
నేవేళనేమానో యెట్లని తెలియ
గావచ్చుఁదడబాటు గలుగుటయరుదె?

ప్రానికదీపింపఁ బోయియాచిత్ర
సేనునకనిలోనఁ జిక్కినవేళ
రారాజువిడిపించె రారాజతిలక
వారికిమనమీఁద వైరంబుగలదె?
పతిపక్షులనకయీ పట్టునమనము
అతిరయంబునసహాయంబుగావలయు
అనుటయుఁదోడుపొమ్మని నియమించె
ననుఁగునందనుల భీష్మాదులనతఁడు
ఆసయంబున నాసుయోధనుఁడు
మీసంబులెగఁదీసి మేనునిక్కించి
గతికూడుకొని నేఁడుకౌంతేయులకును
హితమొనర్చెడినట్టులె తీఁగిమురారి
దునిమిన ధర్మజాదుల నెల్లఁబిదప
ననిలోనసమయింతునని లోనఁదలఁచి
తనరాక ధర్మనందనునకు దెలుప
చుట్టుగుబ్బలిదరుల్ పొరిదిగ్గక్కదల
బెట్టుగ్రమోయఁబ్రయాణ భేరివేయించె
బంధుర సింధుర వటుభటానీక
గంధర్వరథసముత్కరములు గొలువ
నిట్టలంబుగఁదేరులెక్కి యొక్కింత
దట్టమైనహార్ద్వరు తమ్ములు గొలువ

నలువఁగలించి మహాయోధ వరులు
కెలన భీష్మద్రోణకృప ముఖ్యులరుగ
ముందఱనందంద మొనకట్టి నడచు
వందిమాగధులు కైవారంబు సేయ
నానాహవముఁజ ఢక్కాదినాదములు
కాహళరవము శంఖములును జెలఁగ
కమనీయకింకిణీ ఘంటికాలోల
విమలరత్నప్రభా విలసితచక్ర
శుకపక్షవర్ణభా సురజవనాశ్వ
సకలాస్త్రసంయుత స్యందనంబెక్కి
ప్రతిలేనిపూర్వాద్రి పైనొప్పుపద్మ
హితుఁడునుబోలె నాగేంద్రకేతనుఁడు
గర్వితరిపుపద్మ ఘట్టనోద్ధూత
సర్వంసహారేణు సంఛన్నభాను
మండలాఖిలదిశామండ లుండగుచు
భండనోద్యుక్తుఁడై బలిమినేగుటయు
తమ్ములుదానును ధర్మతనూజుఁ
డిమ్ములనతనికి నెదురుగానేఁగి
రంతదుర్యోధనుండ నుజులుదాను
కుంతికుమారు గన్గొని మొక్కనతండు
తక్కినపాండు నందనులు కౌరవులు

క్కటగావించి యుచితకృత్యములు
క్కఁగకూర్చుండి తదనంతరంబ
అక్కడ ద్రోణ భీష్మాదులతోడ
చెప్పఁ ద్రోణుఁగనాశమన సుతుండు
విప్పిలి తేనియ జిందనీరీతి
గయుఁడను పేరిఁటి గంధర్వుఁడొకఁడు
భయమున మము శరణన్న గాచితిమి
వసుమతీవిభునకు వరుసక్రీడికిని
వసనమపహరణ ము ప్రాప్తించెను నేఁడు
అటుగాన మీరును నరుగు దెంచితిరి
అనుటయు ద్రోణభీష్మాది యోధులు
మనమున సంతోషమగ్నులై రంత
సోదరి భూసురులకు భూరిపెట్టించి
వదలకవారి దీవనలు గైకొనుచు
కమలభ వాండంబు గగ్గోలుపడఁగ
తముకసేయించి రత్తజెని, నిండార
అంతనా కృష్ణుండు నాహవంబునకు
సంతోష చిత్తుఁడై చయ్యన వెడలి
ప్రీతివీర సంఘాతభయద ప్రచండ
చతురంగ వాహినీ సంయుతుండగుచు

భీమావహాంబున బిరుదులై నట్టి
రామసాత్యకి ముఖ్యరథికులునడువ
ప్రద్యుమ్న పుష్కర ప్రముఖనందనులు
సుద్యుమ్నరథములు చూపట్టినడువ
అవిరళ నిజవిజయాంకమాలికలు
కవళించికడలబాఠకులుగ్గడింప
ఉరుసైన్యపదఘట్ట నోద్ధూతబహుళ
ధరణీపరాగంబు తపనునిబొదువ
కణఁగెలోకంబెల్లఁగా నిస్సాన
ధణధణంకారమెంతయుఁబెట్టుమొరయ
హరిహేషరవము వీరాలాపనములు
నిరుపమరథనేమి నిర్ఘోషణములు
కరిఘటాజాతఘీంకారనాదములు
వరుసభూతలమెల్ల వణఁకఁ బెల్లడర
గురురత్న కాంతిసంకులమహాచక్ర
వరముయూరిక కుంతవర్మతురంగ
చారుగదాఖడ్గ శంఖశార్ఙ్గాది
భూరిభయంకరాద్భుతరథంబెక్కి
ద్వైతవనాంత రాస్థలమున కేగి
శీతకరార్కులుఁజీకాకుపడఁ
ధరణీవణంక దిక్తటములు వగుల

కటకటా పాపవిధానంద ఘుట్టియిల్లాగినుక
ఖాయమహాగ్రహాగతి సాలనివేళ
సాయనిచుట్టాలు పగవారుగారె
అడవులలో నాథులలములు నమలి
యిడుముఁ బడుచుండఁ దక్కిన యేమికలిగె
గంధర్వవిభున కొక్కఁడునన్నై పూని
బాంధవ యుతముగాఁబరిమార్చఁడగునె
విశ్వంభరుని చిత్తవృత్తిగానడిచి
శాశ్వతసామ్రాజ్య సౌఖ్యంబులొంది
మనుటయు నీతిధర్మంబగు నాడు
మనములోఁదోఁచిన మార్గమిత్తెఱఁగు
ఘనుఁడవు నీవెఱుంగని నీతిగలదె?
అనినద్రౌపదితోడ నాక్రీడిపలికె
నుడివడి శరణంబుఁజొచ్చినవాని
విడుచుట యిప్పుడు వీరధర్మంబె?
మొనకట్టి కార్యంబు ముట్టినవేళ
మగువనేఁడిఁకనున్న మాటలేమిటికి
తలఁకెద వేటికి దైత్యారిసేనఁ
బిలుకుమార్చెదనాడు భీషణాస్త్రముల
గప్పినబహు మిహికాపటలంబు

నిప్పించుమార్తాండ విధమునేపింప
పరమేశదిక్పాల వరదత్తమైన
శరశిలీముఖములు వనజాక్షివాకు
గలుగుటయొఱుఁగవే కదనరంగమున
నలఁత్రులఁబోదునే యనిపల్కెనరుఁడు
ఫాలఁతుకనప్పుడు పొమ్మనియనిపె
తెలివితోనప్పుడు దేవేంద్రసుతుఁడు
ఘనరథారూఢుఁడై కనుపట్టిధర్మ
తనయసమీర నందనులనాకవల
నెయ్యంబుతోఁగూడి సంతుచిత్తమున
కయ్యంబువేడుక కడునగ్గలించి
తెలివిబ్రహ్మాదులు దివినుండిచూడ
బలిసిదుర్యోధన ప్రముఖులుదాను
భూరిభేరీరవంబులు పెల్లుమ్రోయ
వారిధుల్గలఁగ పర్వతములూటాడ
ధారుణీవణఁకదిక్తటములు వగుల
దారుణంబగుదేవ దత్తమొత్తుటయు
బీరంబులాడుచుఁ బెడబొబ్బలిడుచు
సారెకునట్టహాసములుచేయుచును
అందందనార్పుచు నయ్యిరువాగు

స్యందనలఁబోరు నుద్ధతిఁగాలుబలము
పాదిగట్టుకొని రథంబులు రథంబులను
వదలనికడిమి నశ్వములు నశ్వములు
వారణంబులు నటవారణంబులును
దారుణద్వంద్వయుద్ధము సేయుతఱిని
కోరిరాహుతుల మార్కొను వీరభటులు
వారణఘటలపై వచ్చురాహుతులు
భోరునరథికులఁబొదువు మావుతులు
చేరిమావుతులలోఁ జెనకు యోధులును
బలిమికుఠారముల్ పరికించువారు
కలయఁబలువురు నొక్కనిద్రుంచువారు
మూకలు మూకలై మొనకట్టువారు
ఏకాంగవీరులై యెసకట్టువారు
మొనసివిరోధుల మొదలించువారు
వెనుకైన విమతుల విదళించువారు
నిలిచినిపక్షుల నిర్జించువారు
బలిమిపంతములచే భర్జించువారు
పదరియరాతులపై వచ్చువారు
గొదకొని శత్రులగుదిగ్రుచ్చువారు
అయ్యేడరాజరాజ ధికరోషమున
కయ్యంబు శౌరితోఁగావింపఁదలఁచి

ద్రోణభీష్మాదులతో వచ్చికదిసి
బాణాసనంబులేర్పక నెక్కుపెట్టి
గురుతరభీకరగుణ నినాదములు
మొరయించి వాఁడియమ్ముల హరినేయ
కంజలోచనుఁడు శార్ఙ్గంబెక్కుపెట్టి
శింజినిమ్రోయించి శితసాయకముల
అందఁదదుర్యోధ నాదులనెల్ల
చిందరవందర జేసినొప్పించె
భీష్ముఁడంతటమురభేదనుమీఁద
భీష్మసాయకములు పెల్లుగానేసె
ద్రోణసుతుండును ద్రోణుఁడునతుల
బాణావలులు శౌరిపైనేసిరుసరి
కృపుఁడును జేరినిష్కృపణుఁడైకణఁగి
విపులాంబకము నేసెవిష్ణునిమీఁద
కర్ణుఁడుభయద మార్గంబులనేత్ర
కర్ణతల్పుని మీఁదఁగడు సూటినేసె
వెండియుఁదక్కిన వీరపుంగవులు
దండినేసిరికృష్ణు దారుణాస్త్రముల
అవియెల్లనచ్యుతుఁడతులాంబకముల

అవలీలబొడిపొడిగ్గామైరాలనేసె
అవ్వాముద్రోణ భీష్మాది యోధులను
గుప్పెనొక్కట శౌరి ఘోరబాణముల
కరవాలకుంత ముద్గరభిండివాల
పరశుతోమరగదా ప్రాసత్రిశూల
పరిఘపట్టస శర ప్రముఖాయుధముల
బోరిపోరివారలు బొదివిరచ్యుతుని
అపటుశస్త్ర సాయకముల శౌరి
తూపుతండముల తుత్తుమురు గావించి
ఘనతరాస్త్రంబులఁ గౌరవవీర
తనువులు జర్ఝరితములు సేయుటయుఁ
నెత్తుటఁజొత్తిల్లి నిలిచిరిపువ్వు
గుత్తులతోఁ బూరుగులు పూచినట్లు
కినుకతోడగ్గలి కృష్ణుఁడవ్వేళ
కనకపుంఖోజ్జ్వల ఘనసాయకముల
బరికించి కౌరవ పతితనూభవుని
అరదంబు సూతుని హయములఁద్రుంచె
విరథుఁడై యాతఁడు వేవేగనొక్క
కరినెక్కియుద్ధంబు గావించెనంత
నీలాద్రిశృంగ సన్నిభ కుంభికంభ

మాలోనహరిగదా హతినగ్గలించి
ఘురరత్న మయమహాక్తి కంబులురాలి
గనుపట్టె నప్పుడు గహ్వారతలము
ప్రకట సంధ్యారాగ పటలనక్షత్ర
నికరంబుచేనొప్పు నింగిచందమున
ఆసమయంబున నాసురయోధనుఁడు
భాసురాస్త్రంబూని పట్టియిట్లనియె
క్షోపింప గోపాలకులమూకగాదు
నూపట్టుప్రతిభట స్తోమంబుగాని
వినగోపికాగీత వినతులుగావు
తపరినహయహేషి తంబులుగాని
సరినెక్క గేలికాచలములుగావు
సరభసమత్త కుంజరములుగాని
మెట్టగాళీయఫణి మేసదికాదు
దట్టంపురథ సముత్కారములుగాని
మలయబృందావన మార్గంబుగాదు
బలువైనసంగ్రామ పద్ధతిగాని
గోపాలనీకేల ఘోరయుద్ధంబు
భూపాలుఁడవుగావు పొమ్మనియేసె
యేసినమురవైరి యెంతయునొచ్చి

ఆసుయోధను నదరంటవీక్షించి
చెలరేగి చెలరేగి చెనకెదునీదు
కోలఁదియెఱుంగవు గుప్పుననిన్ను
ఊకించిపట్టిన నుక్కుచచ్చెదవు
గైకొనివిడిచిన గాలిఁబోయెదవు
చిక్కితక్కడనీవు చిత్రసేమనకు
నిక్కడవిరిగి పోయెదవేల నేఁడు
అనువేదిలజ్జ బంధాయస్త్రమతికి
జనుదెంచినాఁడవు సమరంబు సేయ
నెగ్గెఱుంగవునిన్ను నెదిరిపోరాడ
సిగ్గయ్యెడినివాకు ఛీయనిపలికి
అమ్మధుమర్ధనుండ డరిశార్ఙ్గమున
సమ్మోహనాస్త్రంబు సంధించియేయ
జన్యాంగమున భుజంగకేతనుఁడు
సైన్యంబుదాను మూర్ఛాగతుండయ్యె
మనములో సప్పవమానజుఁడంత
తనతనూభవుఘటోత్కచుఁ దలంచుటయు

—: ఘటోత్కచుని యుద్ధము :—

బహుళరక్షోవీర పరివారుఁడగుచు
ఝుషీకినేతెంచి ధర్మజ ముఖ్యులైన
పాండవేయులకెల్ల ప్రణమిల్లియపుడు

ఖండనోద్యుక్తుఁడై పనివినిఁగష్టు
సేసలనంతయుఁ జీకాకుపఱచి
పూనకతనమహా మాయానిరూఢి
గాఢాంధకారంబు కలయఁబర్వించి
మూఢశైలములు జేర్కొనిమీఁదవైచి
నిలచిమేఘములట్లనిఁగి గర్జించి
ఫెళఫెళమని మ్రోయపిడుగులతోడ
పూనికయరదండ భోరునరాళ్ల
వానలనిప్పుల వానలనంప
వానలపాముల వానలఁదేళ్ల
వానలనెరమంట వానలబిట్టు
కురియింపఁదక్కిన ఘోరరాక్షసులు
అరుదుగాఁ బెక్కుమాయలు బన్నుటయును
శరభకంఠీరవ శార్దూలభల్ల
కరిగండభేరుండ కాసారములును
అరుదెంచి నిలిచిచయ్యన కసిమసఁగ
హరిసైన్యమెల్లను హరియింపఁదొడఁగె
పెక్కండ్రుదైత్యులు భీకరలీల
నొక్కట బిట్టుమహోద్ధతి మెఱసి
తరలి త్రిశూలఁహాస్త్రంబులతోడ

సారిదినెత్తురుచాయ జుంజుర్గలతోడ
మిగులనెఱ్ఱనిపెద్ద మిడిగ్రుడ్లతోడ
వెఱగకట్టుబొమముళ్ల మోములతోడ
దహనకీలాభీల దంష్ట్రులతోడ
తహతహ నిగుడ యాదవరాజుసేన
వడిబట్టికొని మ్రింగ వచ్చినశౌరి
అడరిన లేసమాయ నామాయ నణఁచె
అమల విజ్ఞానోద యప్రభావమున
అమితప్రపంచ మోహముబాసినట్లు
అప్పుడు మురవైరి యాదైత్యసేన
గొప్పతూపుల గీలుకొలిపిన మఱియు
అనువైనబాణంబు లాతనిమేన
కనుఁగొనియేసె నాగ్రహముఱెట్టింప
నెలవంక తూపులనిర్జరారాతి
విలునారిఁదెగవేసె విశ్వంభరుండు
క్రుద్ధుండు దోషాచరుఁడు పట్టినట్టి
సద్ధర్మగుణమెల్ల సడలికత్రుంచె
వెండియునొక మేటివిల్లుచేఁబూని
చండభయంకర జ్యారవంబడర
ఘనశరంబరిఁబోసి కంసారికనిమె

వనజాసిజలధి మిన్నకసొర్ధరాదు
ఊరుపర్వతము క్రిందనుండఁగరాదు
ధరణిక్రిందికి మహోద్ధతి బోవరాదు
మనుజసింహుఁడనని మలయంగరాదు
చెనసినాముంటిచే సాచరాదు
వనరాదు రాజహింసకు నన్నుమీరి
వనములలోపు వర్తింపరాదు
మఱియుకాళిగునిమర్దింపరాదు
ధరబుద్ధుండనితలఁపఁగరాదు
తలఁగుతలగు యాదవకులాధీశ
జంభమర్ద భుజాస్తంభ విజృంభ
దంభోళి గోలెడు తలఁపనాశరము
చండమహోద్దండ సమవర్తికాల
దండంబుబోలెడు తలఁపనాశరము
బహుభయంకరమున భవఫాలనేత్ర
దహనము బోలెడు గలఁపనాశరము
నీకు నిప్పటి నవనీతంబుగాదు
చేకొనుమెసఁగనో సితపద్మనేత్ర
అని శిరి నేసిన నాయమ్ముబిట్టు
చనితూరనాటరో షస్ఫూర్తి నిగుడి

అరుణకటాక్షుఁడై యాలంబులోన
బరికించి నిశితాస్త్ర పంక్తులనేయ
దారుణాస్త్రముల నా దనుజ సైన్యంబు
ధారుణిమీఁద నెంతయుఁ గూలనేసె
మంటలు గ్రక్కెడు మార్గణం బొకటి
వింటసంధించియు వినుమనిపలికె
నాకవాసులయట్లు నన్నుఁ జూచెదవు
నీకింత గర్వంబు నేఁడేల వచ్చె
పర్బినాతోఁడనీ వెదుగుట మిగుల
కార్చిచ్చుపైబడఁ గవిసినయట్లు
నోడువకీమాటలు, నోరికిదగిం
కడిగొనునీలావు గాఁ నయ్యెడిని
అనుచు నేయుటయువాఁ డాశిలీముఖము
ఘనతరవక్షంబు గాడి మూర్ఛిల్లె
కవలుఁ ద్యుమ్న ప్రముఖులునా వేళ
తవిలిబోరాడుచోఁ దాళాంకుఁ డదరి
మెడసాచ్చి కవలపై నిషుపరంపరలు
వడిగుప్పటయుఁజూచి వాయుజుఁడలిగి
అట్టహాసముచేసి యార్చుచు బేర్చి
ఘట్టించి రేవతీ ధవుమీఁదఁగదిసి

కరికరితోఁ బోరు కైవడిఁ దోఁప
హరిహరితోఁ బోరు నాజాడ మెఱయ
గిరిగిరితోఁ బోరు కియఁ గనుపట్టి
పొరిపొరి నిరువురు బోరిరత్తఱిని
ప్రళయకాలాంతకు భంగినుప్పొంగి
బలువడి భీముండు పటుగదాహతిని
అలమి సూతధ్వజ హయసమేతముగ
చలమున నుగ్గు నూచంబు సేయుటయు
బలభద్రుఁడును వాని భయదోగ్రరథము
నలినలి చేసె నున్నతశైలాగ్రములఁ
ఇరువురు విరథులై యేపగ్గలించి
ధరణికి లంఘించి తనువులు పెంచి
తరువులు పెఱికి యుద్ధతిఁగొని తడవు
సరిసరి బోరాడి చాలించి పిదప
బలవిసర్జిత మహాబలుఁడైన బలుఁడుఁ
అ సువిక్రమశాలి యైన భీముఁడును
జేరి బాహాముష్టి చేకొని పెనఁగి
నాకసారకును ముష్టాముష్టితోడ
అన్యోన్యజయకాంక్షులై పోరాడఁ
జన్యఃరుండు మచ్చరమున వచ్చి

క్షోణీతలంబునఁ గూలంగ నేసె
బాహ్లేయుఁ బునఁ బావనిఁ గవల
హరిబలక్షాత్ర సాత్యకి ముఖ్య యోధ
వరులఁ దవిష్వచ్చు వడిఁ జట్టుముట్టి
భృకుటితస్ఫూర్తి తా భీల బుగాఁగ
సకలాయుధంబులఁ జాల * ప్పాటయ్యు
అవిజేయుఁ డైక్రీడి యంతరామాగ్ర
భవునిపై రణబల ప్రౌఢిఁ దీపింప
గాండీవనిర్ముక్త కాండజాలముల
నొండొండు ధరణిపై నొరగు నేనుఁగులు
అరవరలైపోవు నరదతుండములు
పరవరలైపోవు పటుభటావలులు
అట్టిట్టుపడియెను నశ్వసంఘములు
దట్టమైపారు రక్తములు గావించి
అచ్యుతాగ్రజుఁ బదియారు భల్లముల
అచ్యుతనిరువది యాతుబాశుగముల
నాంబునినైదుని శాతబాణముల
శంబరాంతకునాఱు సాయకంబులను
కాంభోజునెనిమిది కర్కశంబులను
కుంభోదరునినాఱు ఘోరబాణములు

కృతవర్మ నరువది పృథుకదంబముల
శ్రుతసోమునిరువది సురుచిరాస్త్రముల
ఘనపత్రకంకాష్టకమునఁ బుష్కరుని
అరుణుని తొమ్మిది యతులాంబకముల
అనిరుద్ధునాలుఁగు నతులాంబకముల
శరములనేడింట సాత్యకినొంచి
గాండీవిశింజినీ క్వణనంబుచెలఁగ
దండిసమ్మోహ నాస్త్రంబుబిట్టేయ
నురుగతిశౌరియు నొక్కండుదక్క
హరిసైన్యమంతయు నటమూర్ఛమునిఁగె
బరగంగిశార్ఙ్గచా పజ్యారవంబు
మొరయించిదేవకీ ముద్దులపట్టి
కట్టల్కతో కాండ కాండసంఘముల
బిట్టేసెనొక్కట భీభత్సుమీఁద
ఆశార్ఙ్గ ముక్త బాణాగ్నులవిజయు
డాశుగదృష్టిచే నార్చెఁజిత్రముగ
శౌరినిష్ఠురబాణ చండసంపాత
దారుణధాటికిఁ దలకకవ్వేళ
కల్పాంతజీమూత కరణిఁగో భుజగ
తల్పుపైగురిసె నాతఁడు శరవృష్టి
గరుడకేతనుఁ డంధకారాస్త్రమేయ

సారదినర్జునుడేయ సూర్యబాణంబు
పుండరీకాక్షుండు భుజగాస్త్రమేయ
గాండీవిదానికి గరుడాస్త్రమేయ
దంతివత్సలుఁడు భూధరబాణమేయ
కుంతీకుమారుఁడు కులిశాస్త్రమేయ
చక్రిధారాధర సాయకంబేయ
శక్రసూనుడు ప్రభంజనశరంబేయ
నరుడుదారుణ వారణంబుబిట్టేసె
పర్వతంబులుపూర్వ పక్షంబుచేసి
ఘనతరకింకిణీ ఘంటికానివహా
నినదభయంకర నిష్ఠురశక్తి
వాసుదేవుండు దేవతలుభీతిల్ల
వాసవాత్మజుమీద వైచెవైచుటయు
సమధికోల్లాసభా స్వన్మూర్తియగుచు
అమరేంద్రనందనుండమ్మహాశక్తి
చండకాండంబునఁ జయ్యనరెండు
ఖండంబులైపోవ గానేసెనదుమ
యదువీరవరుఁడు బ్రహ్మాస్త్రమేయుటయు
బదరికిరీటియు బ్రహ్మాస్త్రమేయు
నారాయణాస్త్రంబు నారిసంధించి.

నారాయణుఁడంత నరునకిట్లనియె
ఈశానుఁడిచ్చినాఁ డీదేవకుగరుణ
పాశుపతానేక బహు సాధనములు
విచ్చలవిడిదిశా విఫలచేఁగోరి
తెచ్చినాఁడవు పెక్కు దివ్యబాణములు
నడిసన్నవాఁడవు సమరరంగమున
కడలేని విక్రమక్రమధురీణుఁడవు
నీశౌర్యమహిమయు నీదివ్యబాణ
కౌశలంబును నేఁడు గానవయ్యెడిని
నారాయణాస్త్రంబు నాటిబావలికిఁ
బానుపమర శలభమవుగ కున్నె
అనుచునర్జునుమీఁద నమ్మహాశరము
వనజాతనేత్రుండు వైచెవైచుటయు
తరణిచంద్రులుగతి తప్పిచరింప
ధరణీవణంక దిగ్దంతులుమ్రొగ్గ
వెఱచి వేల్పులువిను వీధిపైనొరగ
నేఱమంటగములతోనే తేరజూచి
గాఢరోషంబున గాండీవి యపుడు
మూఢిగా బ్రహ్మ శిరోనామకంబు
వరుసతో మంత్రపూర్వకముగా దొడిగి

తరుణేందు మౌళి చిత్తములోన నిలిపి
ధర్మతనూజ సత్యము నిజంబేని
ధర్మ వర్తనుండనై తనరితినేని
సరిలేని కుంతి భోజమహీంత లేశ
వరతనూభవ పతివ్రత యగునేని
చనుగాక దీనిచే నరినమ్మ హాస్త్రి
మని ప్రయోగించిన నద్భుతంబెసగ
నుష్ణాంశు కోటి సముజ్జ్వలంబైన
వైష్ణవాస్త్రంబుతో వడిసకిపోయె
ఆ సమయంబున హరియునుమంద
హాసంబు దీపింప నర్జునుజూచి
పాలుచునీయస్త్ర నైపుణ్యంబు మేలు
దలచుము నీయిష్ట దైవంబునింక
దివమున కేగిన దివిరిపాతాళ
భువనంబు జూచిన పోరిబుత్తునిన్ను
నీచక్రధారకు నిపుడు ప్రాణములు
ఇచ్చెదో గంధర్వు నిచ్చెదోయనుచు
ప్రళయార్క బింబ ప్రభాపరివేష
ప్రలసిత చక్రంబు వలకేల బూనె
ఆలోన విలయకాలాన లాభీల

కీలక రాళ్ళమై కెరలుచు రౌద్ర
భద్రమై యొప్పెడు పాశుపతంబు
పురుహూత సుతుడును బూనె నావేళ
శ్రీ మహాదేవుడూర్జిత కృపాసాంద్రు
డామహాత్ములు కలహంబు వారింప
బలుగాలి మేతల పడకంబుతోడ
కలికి ముమ్మూర్తులకైదువుతోడ
తూలెడు మువ్వన్నె దుప్పటితోడ
కీలలు మెఱయు మిక్కిలి కన్నుతోడ
పరువంపు వలపుల భసితంబుతోడ
మురువైన నప్పంచ మోములతోడ
చక్కని కెంజాయ జడముడితోడ
తక్కరి వెన్నెల తలపువ్వుతోడ
బాయనిమంచు గుబ్బలి కూతుతోడ
వేయి భంగుల నొప్పు వెలగిబ్బతోడ
ప్రమథవాణీశ దిక్పాలుర తోడ
నమరులతోడ బ్రత్యక్షమై శివుడు
నరమురారాతుల నడుమ దానిలిచి
సరసిజాక్షుని ముఖాబ్జముచూచి పలికె
ఓహో! పురే! కోపమువసంహరింపు

సాహసంబేల విశ్వంభర నీకు
నలుగంగఁజెల్లునే యర్జునిఁ మీఁద
దెలియ నాద్యుఁడవౌదు దీపింప నిపుడు
నీవాది మూర్తివి నీ విశ్వమెల్ల
ఘట్టింప రక్షింప బొడవడఁగింపఁ
బస్త్రైన యాపరమ బ్రహ్మంబు నీవ
అరయఁగ నీదు మహత్త్వంబు దెలియ
నెరయ నెవ్వారలు నఖిలలోకముల
ధరణి భారముమాన్ప తలఫునమీఁద
లిరువురుపట్టి నారీ జగఁబులను
నీవన నేనన నేదిభేదంబు
భావించి తెలియునీ భావఁబులోన
నాకును నీకును నరుఁడొక్కరూపు
గాకున్న శౌర్యంబు గలదె. యీతనికి
అనఘుఁ డర్జునుని సత్యప్రతిజ్ఞలకు
మనము మెచ్చకయున్న మఱిధర్మమేది
అని ధనంజయుని సత్యాదరంబెసఁగ
దనుఁజేరఁబిలిచినఁ దడయకవచ్చి
ఘనభక్తి నిండారఁగా ప్రణమిల్లి
కనులార దిలకించి కడఁకనుతించె
జయశ్రీశైల జాధీశ! జయపరమేశ!

జయ హేమనగచాప! జయదివ్యరూప!
జయ తారనగవాస! జయకృత్తివాస!
జయదివ్యచారిత్ర! జయ ఫాలనేత్ర!
జయ భోగికేయూర! జయనిర్వికార!
జయ యోగి సంస్తుత్య! జయ సత్యనిత్య!
జయ సంతతోత్సాహ! జయవృషవాహ!
జయచంద్రికావర్త! జయకృపాపూర్త!!
అని వినుతించిన నభవుఁ డర్జునుని ।
దనకృపాదృష్టిచేఁ దవరిన వేడ్క ।
గనుఁగొని పలికె నోకౌంతేయ యిప్పు[illegible] ।
నీరజనేత్రింతు నేముమెచ్చితిమి ।
వరములెయ్యవి నీకువలసినవిప్పుడు ।
కోరుము నీవన్నఁ గుంతినందనుఁడు ।
హరిహయప్రముఖాష్ట హరిదిశాదత్త ।
శరజాలనిబిడ నిషంగమధ్యమునఁ ।
గదలకయున్నట్టి గయువెడలించి ।
మదిలోనభయము గంపముపోవనపుడు ।
వేదాంతవేద్యులౌ విష్ణుశంకరుల ।
పాదపద్మములకుఁ బ్రణుతిసేయించి ।

యీాగయుఁ గాచుకే యిదివరంబనిన।
నాగజవరదుండు నభవుపంపునను।
కలశాంబునిధి కన్యకామృదుగండ।
ఫలకపయోధర పాళికాయుగళ।
మకరికాపత్ర నిర్మాణచాతుర్య।
సుకుమారహస్తంబు సూటిగాఁజూచి।
వాసవానోకహ వరపుష్పనికర।
వాసనవాసితోజ్జ్వలమైనయట్టి।
గంధర్వశిరముపై గ్రక్కుననునిచి।
గంధర్వనిన్నునేఁ గాచితినమ్ము।
మన్నిలోకంబులయందుఁ దేజమున।
మున్నిఁటియట్ల యిమ్ములసంచరించు।
నాకొక్కచందంబు నరుఁ డనునీవు।
ఎక్కడశభయము నీకెన్నఁ డులేదు।
అనె, నభంబునవాస యందందగురిసె।
అనిమిష దుందుభులంతింత మొరసె।
అప్పుడు కొనియాడిరఖిల దేవతలు।
తప్పక పార్థుసత్యవ్రతమహిమ।
అంతట పరమేశ్వరుఁడర్జునుఁజూచి।
సంతుష్ట హృదయుఁడై చయ్యనఁ బలికె।

ఇచ్చెదనడుగుమీ యింకొక్కవరము।
విచ్చలవిడినన్న వివ్వచ్చుఁడనియె।
మొదుగాఁ గృపనిచ్చు మీవరంబునకు।
పాండవేయాగ్రణి ప్రాప్తుండుగాక।
యేనెవ్వఁ డనటన్న నీశుండుధర్మ।
సూనునిదప్పక చూచినయిప్డు।
పట్టినభక్తి నప్పాండవాగ్రజుఁడ।
పుట్టినహర్షాశ్రు పులకలతోడ।
ఘనశక్తిపరిణామిల్లి కణఁకనుతించె।
పరిణతసురానీక! పాలితాలోక।
ఫణిపతిఁ గ్రైవేయ! పటురూపధేయ।
భర్గ! గుణోపేత! భావనాతీత।
నిర్గుణ! నిరవద్యనిగమాంతవేద్య।
అనివినుతించిన భవుఁడుధర్మ।
తనయున కధిక మోదమునవిట్లనియె।
ధరణీవరోత్తమ తప్పక నేను
మురవైరినీ సత్యమునకు మెచ్చితిమి।
అడుగుము వరమన్న నపుడుధర్మజుఁడు।
పుడమిపై నీరెండుభూరిసైన్యములు।
బ్రతికితొల్లిటియట్ల బలమందఁ జేయుఁ।

డిదియ వరంబు నాకిచ్చుటయునిన।
సదయులై హరిహరుల్ సైన్యయుగంబు।
బ్రిదికించుటయు దంతిభటహయావలులు।
మిన్నకనిద్దురమేల్కాని నట్లు।
జెన్నొందలేచెనా చతురంగబలము।
విజయుండునప్పుడా విష్ణుదేవునకు।
నిజభక్తిఁ బ్రణమిల్లి నిలిచి కేల్మోగిచి।
అపరాధి నజ్ఞాని నఘసమేతుండను।
కపటచిత్తుండనన్ను గాచిరక్షించు।
అనివిన్నవించిన నర్జునుమోము।
గనుఁగొని కృష్ణుండు కౌఁగిటజేర్చి।
ఘనతరసంతోష కలితుఁడై యపుడు।
అర్జునుతోడ నిట్లనియెనో పార్థ।
దుర్జయరిపుసేనతో నీకుమీఁద।
నురుసంగరము గల్గుచున్నదిగాన।
పరభసవృత్తి నీశరకౌశలంబు।
గట్టిగానెఱిఁగెదఁ గాకనీపట్టు।
బట్టితినింతియె పగమె నీమీఁదఁ।
గలుగునె నాకు నేకడలనీవెట్లు।
మెలఁగనైగిన నీమీఁదఁగోపంబు।

అనిధనంజయు భయామపుడుడిగించి।
ఘనతరసంతోష కలితుఁగావించె।
మహిమతోనాశ తమఖలినరా భవుని।
బహుముఖంబుల పద్మభవుఁడు నుతించె।
తనవేయుకన్నుల తనయుని మోము।
తనివోవఁ జూచె బృందారకవిభుడు॥
మునిసిద్ధదేవసమూహంబులెల్ల।
వినుతించిరందంద వివ్వచ్చుఁ జూచి।
హంసుఁడును బ్రహ్మాదులగు వారితోడ।
నరిగె వేడుక రజతాచలంబునకుఁ।
పాండునందనుల ద్రాపదినాదరించి।
పుండరీకాక్షుండు పోయెద్వారకకు।
దారితశత్రుఁడౌ ధర్మజుండనుప।
రారాజుహస్తిపురంబున కరిగెఁ।
పాండవాగ్రజుఁడును పరగజయించి
దండిగా వహించె దారుణీభరము।
సునిశితమతి పాండుసుతులకు మ్రొక్కి।
తనసేనతో ఘటోత్కచుఁడంతసరిగె।
గాండీవిఁగొనియాడి గంధర్వవిభుఁడు।
దండిపుష్పకమెక్కి తనపురమరిగె।
మండితకీర్తి భూమండలంబేలె।

నివ్వసుంధరనొప్పు నీపుణ్యచరిత।
మెవ్వరుచదివిన నెవ్వరువినిన।
నాయురారోగ్య సమగ్రిలునగుదు।
రేయెడవైభవం బింపు పెంపొంది।
అనుచుసూతుఁడు శౌనకాదులైనట్టి।
మునులకుసంతోషమున వినిపించె।
అనఘభూజా సరోహంసునిఃపేర।
సనకాదియోగీంద్ర సన్నుతుపేర।
దిననాయకాన్వయ దీపితుపేర।
నక్తంచరసమీరణ స్వామిపేర।
భక్తవత్సలుపేర బంధుకోదండ।
పీటికాభ్యంతర విలసితయుగ్మ।
వాటికు రాఘవేశ్వరు పేరు వెలయ।
జానకీవిభు పాదజలజ భృంగాయ।
మానవమానసుఁడు తిమ్మయమంత్రిసుతుఁడు।
ధీసమన్వితుఁడు నాదిండ్లశాసనుఁడు।
భాసురకీర్తిగోప ప్రధానుండు।
చారుకృష్ణార్జున సంవాదమొనరి।
గారచియించె సత్కవులు నుతింప।
నేచియీకృతి ధరణీశుల సభల।
నాచంద్రతారార్కమై యొప్పుగాత॥

సంపూర్ణము.

# శుద్ధపత్రిక



| పుట | ప | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 3 | పార్థవ | పార్థివ |
| ,, | 14 | పొదవలు | పొదుపులు |
| 4 | 16 | బొదవ | బొదువ |
| 6 | 10 | తుంపురల | తుంపు[illegible] |
| ,, | 16 | భామ ారాతి | భాసురారాతి |
| 7 | 20 | లేమిని | లేమి |
| 9 | 7 | యడము | యడ్డము |
| 13 | 16 | కిన్నెర | కిన్నర |
| 14 | 12 | కాయు | కాయ |
| 15 | 11 | నాస | నాథ |
| 19 | 15 | వ్య | దివ్య |
| ,, | 21 | బుదులు | బుద్ధులు. |
| 27 | 20 | యంతయు | ఎంతయు |
| 28 | 2 | మేపటు | మేపట్టు |
| 30 | 1 | రుర్మిణి | రుక్మిణి |
| 31 | 16 | శార్జి | శార్ఙ్గి |
| 33 | 7 | కలికి | కలికిమెఱుంగు |
| ,, | 15 | మొత్తైమై | మొత్తమై |

| పుట | పం | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 34 | 6 | పందబై | పదంబై |
| 33 | 18 | వదన | వరద |
| 40 | 14 | సమ్మదంబు. | సమ్మదము |
| 41 | 16 | పొరిది | సొరిది |
| 42 | 5 | నానాహావ | నాహావ |
| 43 | 1 | రుచతి | రుచిత |
| ,, | 6 | గయుఁడచు | గయుఁడను |
| 45 | 14 | దాపది | ద్రాపది |
| 46 | 14 | జూచ్చిన | జొచ్చిన |
| 47 | 2 | వర | పర |
| 48 | 15 | విదంళిచు | విదళించు |
| 53 | 1 | గష్ణు | కృష్ణు |
| ,, | 8 | యరదంద | యరుదంద |
| 57 | 10 | లాగ్రిము | హాలాగ్రిము |
| ,, | 13 | గాత | గారిత |
| ,, | 16 | అఘు | అలఘు |
| 63 | 19 | సరసిజాకుని | సరసిజాక్షుని |

